మం టేని క్షేపము- నాతికేవ్రుడు మునకుం-మీదకోపము॥ఎం॥౨॥ వారాసికిపందులు సాకింది- వల్లమాలికోళ్ళను పెంచింది- నీరాకకదోవలుగాచింది- నిన్నుగూడగ ర్వమునుండించిది॥ఎంత॥౪॥

అసావేరిరాగము - చాపుతాళము.

౧౪౧. చిన్నదాననన్నేలచెనకేవిందరిలోనీ- సిగ్గెల్లపయెయ్యెరా ॥ ప॥ కన్నుసైగచేసిగారడములాడేవు- వెన్నముచ్చిలితిన్న వేణుగోపాలనే॥అ॥ బొమ్మలపెండ్లికికొమ్మలువేగమే- రమ్మనసేసంతోసమ్మునబోవగా - సొమ్ములి దుగోకైకొమ్మనిచెంతకు-రమ్మనుంతముగ్ధిమ్మనికోసరేవు॥ చిన్న॥౧॥ పున్నమ నుచుసన్నవన్నెవలువగట్టి- కన్నెలతోనీసుకదిన్నెలచెన్నైన- గున్నపొన్నచాల యగన్నేరులుగోయు- చున్నతిన్నగపొంచిచన్నులుపట్టేవు॥ చిన్న॥ ౨॥పండ్లుకా వలేచెల్లెంద్రడకనుచుగొల్ల- లిండ్లిండ్లుతిరిగివూచెండ్లుకొమ్మనిమగ- వాండ్లువవ్వ పండ్రెండేడ్లదానవునన్నె- పెండ్లాడేననిరూతలిడగద్దుచేసేవు॥చిన్న,౩॥

భైరవిరాగము - అటచాపుతాళము.

౧౪౨. నీపొందుసేయకవిడచేనా- వరె - నెలతకొప్పునవిరులుముడి చేనా- నే॥ప॥ బాపురెనేజేయుప్రతినచెల్లకపోతె - నాపేరుశ్రీవేణుగోపాలు కనవలెనా॥ అ॥ మరునిగూర్చితపముసేయన - యీడ- మనసునెదంటేనేయు మేనా- మరులునిలుపలేకమరిమరిపెంటె- కరుణమాలియుబైకంద్లెట్రసేయగా నే॥ నీ॥ ౧॥ పాటబాడిమెప్పించనా- నీపై- పదముజెప్పవలపించనా- బూట లమారినీపుణ్యాము నేకొద్ది- మోటుబారునోనిమొగముచిల్లించగానే॥ నీ॥ ౨॥ హానలమ్ములువేటగొట్టనా- నిన్ను- కూడితపొంగళ్ళుపెట్టనా- చానరోబతిమా సరసకురమ్మంటె- కానిలేలెమ్మనికసరిపొమ్మనగానే॥నీ॥౩॥

మోహనరాగము - ఆదితాళము.

౧౪౩. కులకాంతలువిడబడినలుదికుంల చెలరేగితిరిగెరిదేటిపాపమో॥ ఐతే- వేలయాండ్లకుజీవనమేమిక- శ్రీవేణుగోపాలసంకరమై॥ అ॥ ఉగతెలి కనీబిడ్డలనెడబాసి - యున్నమూలమనీతదాటవేసి - మగనిపోరుకారాదనిరో - మన్నెకాపురమువ్యర్థము జేసి॥ కు॥ ౧॥ తలిదండ్రులమదితల్లడబెట్టి- తమ

జాతులపకేతికాజుట్టి- తలపరాని నిందెలకొడిగట్టి ధర్మమాగము ముసురోసికబుట్టి॥ కులకాం॥౨॥ అందెలుమెట్టెలుబరవికెలోజుట్టి అత్తమామలకుదుద్దులుపెట్టి- బందరుపావడతో చద్దికట్టి- పట్నముబూతామనిభ్రమబుట్టి॥ కుల॥ ౩ ॥ జల్లడుగుల చీరెమెత్తికట్టి - చల్లడగ్గమొకటచేతబట్టి- ఒల్లెయొడ్డ్వనదుముకుబిగజుట్టి - నల్లకొజిలనింపుసుకుపెట్టి॥ కులకాం॥౪॥ పగలురేయిజాగ్రతగానడచి-బాపనింటపూటసాళ్ళగుడిచి - తేగువతో చౌకేలగడచి- తగుచుమనుచుసిగ్గుశరమువిడచి॥ కుల॥ ౫॥ జారుపైటమెడకుబిగయజుట్టి- తేరలంజకాండ్రచేట్టుబట్టి- ఊరిమొగముజూడకోతబుట్టిడబ్బిబెబ్బతోడతట్టి॥౬॥ ఇంతదూరమెవరువెదుకరారతియిసుకవచ్చివేలువంచలేరని- అంతపనికిలేవిణిపట్రూపని - చింతలేదుహూణుల దర్బారని॥ కుల॥౭॥

కల్యాణిరాగము - ఆదితాళము,

౧౮౪. ఈసీమలోహరిణాక్షులవలెగాదీ మోహనాంగీ॥ ప॥ కాసీపురినుండివచ్చినదీకల్యాణివేణుగోపాల॥ అ॥ కన్నడసేయకునీదరబారు - గాచియున్నదిరానాబనుండి- అన్నమెరుగనుయాహరిసాక్షిగనావెబట్టెరా - వన్నెలాడిబహుశానాతో దనవద్దికితోడితెమ్మనె- నెన్ననొకరితరముగాదు సామజయానరీపిపడుచుతనము॥ ఈ॥ ౧॥ పంచమశ్రుతితంబురమీటిసంచుగాబాడిసారంగ - పంచిపెట్టిపటులవినికిచనేప్రౌఢనాయకిరా । వంచననింతలేకనుపలుమారువనితగౌరిపూజచేయువేళ । సంచిసాయకునీజాణలరాకకుభయముజెందరవచ్చెవరాళి॥ ఈ॥ ౨॥ శ్రీమురిచెలువొందుచున్నదిరామామణిరంగుమీర- కామించివచ్చెననుచునీ వింకాయేబిగుదులీరా- ఆమానిని- కెంతోనీపైయాసవేరే భ్రమితో చదు - నామాటవినియేలకొరినభినయము నాట్యమతివచేత లలితము॥ ఈసీమలో॥౩॥

సురటిరాగము - చాపుతాళము.

౧౮౫. ఆడకేపోరాయెదు రాడకపోరా॥ ప॥ వేడుకలీడచెల్లదు-వేణుగోపాలనాసామి॥అ॥ ఐదువరాలిప్పించెనన్నైదువరాలిట్లిటగాదు॥ అ॥ ౧॥ చీటిబంపినదానికిబందరు- చీటిబంధనదేమగువకో॥ ఆ॥ ౨॥ యేకాంతులతోనే ప్రొద్దు। ఏకాంతలతోగూడిరో॥ ఆ॥౩॥ పదముపాడించింకనీ। పదములుబట్టు

కుంటివో- ఆ, ౪॥ వాలుగంటిచెలియాన- వాలుగంటి సంపెంగదేవతో॰ ఆ, ౫॥ వాతెరవిందుసేయనె - వ్వతెరావించేనన్నదో॰ ఆ, ౬॥ ముందర గూడెన్ట్లాచె లి- ముందరగూడదికమీఁద॥ ఆడకే, ౭.

పరజురాగము - రూపకతాళము.

౧౪౬. ఎంతవేడు కొన్నలుక డేమిసేతు కొమ్మా॥ ప॥ ఇంతరాతిమన సువానినెందుగానసమ్మా॥ అ॥ కాసిదానివలెనననన్నుకనులఁజూడడమ్మా - పూనిచె య్యివిడువ తనయవమానమటేకొమ్మా॥ ఎం,౧॥ గచ్చులాడి నాపైమచ్చరించె న మ్మా - మచ్చవల్లినా విభుని మనసు విరిచెనమ్మా॰ ఎం, ౨॥ చిటుకుమన్నకోపమైతె నెటులసైతునమ్మా - కటకటాదైవమింత కరుణదప్పెఁ మ్మా॰ ఎం, ౩ ॥ మాయ దారివగలకెంతో మరులైతినెకొమ్మా - బాయననుచు చిన్ననాడె బాసలిచ్చెన మ్మా॰ ఎం ౪॥ వేణుగోపాలునికివి వేడుకాయెనమ్మా - జాణయనుచు నన్నుగూ డిజాలిబెట్టెనమ్మా॰ ఎంత, ౫.

కేథారగౌళరాగము - ఆదితాళము.

౧౪౭. ముసలిబడుచుమీఁదనెంత మోహమే- ముదితరో నీకు మదిలో॥ప॥ అసమశరుఁడనుచునుప్పొంగేవు - అన్నిటినికానుగదాముఖ్యము॥ అ॥ తలమొలక డవెళ్ళనరసిబోనె- దగ్గిదగ్గిహీనస్వరమాయె - పిలచినఁ వినరాదాయె - బ లిమియుడిగి తప్పటడుగులాయె॰ ము, ౧॥ రాత్రైతె రేచీకటికదలదు - రమణి నిన్నుబిగికౌగలి వదలదు - మూతిమీఁదబట్టనేమారదు - ముష్టిపై తెయొకరికేయ నియదు॰ ము. ౨॥ అధరపానమేలాగునజేసెనో - యతనుకేళినిన్నెటు వేప్పిం చెనో - విధికినెవ్వాళ్ళుచలముండెనో - వేణుగోపాలుడెటుగూర్చెనో॥ ము సలిబడుగు, ౩.

ముఖారిరాగము - అటచాపుతాళము.

౧౪౮. ఎందుకు బొంకేవురా- లేదనినాతో- యెమ్మెలుసేయకురా॥ప॥ ముందరివాడవ వేణుగోపాలనీ - ముచ్చవగలమానరా నసామి॥ అ॥ నిన్న దానింటికి పోలేదా- నీవదినన్నాడుకోలేదా - అన్నియుపుడేతారుమారుగా దా- యారయిట్లయితే కోపమురాదా॰ ఎం, ౧॥ సరసాలాడుకోలేదా సన్న జాజులు జడనుంచుకోలేదా - పరిమళములదుకోలేదా - భామచెలువిడెనంచు

కోలేదా॥ ఎం, ౨. చెలినికగిలించలేదా - చేరిమోవినిముద్దిడలేదా - కేలకేలన ర్వ్యకోలేదా - కీరవాణినిమెచ్చుకోలేదా॥ ఎం, ౩॥ దయమరువవద్దనలేదా - దక్కితిననివేడుకోలేదా - నయముగాపదమువినలేదా - నాతెనినుబాయలేదనలేదా॥ ఎం, ౪. నన్నుగూడినవాడవుగాదా - నాతోయీసుద్దులుదెల్పనియదా - చిన్నబుద్ధితేరోసముగాదా - కన్నెసేలితిననిపలుకరాదా॥ ఎం, ౫,

బిలహరిరాగము - ఆదితాళము.

౧౪౯. తిన్నగమాటాడర వేణుగోపాలవుర్యా మచ్చినినీకు॥ ప॥ మొన్న రేయినీసన్న దెలుసుకొని - కొన్నమగడున పైగోపగించెరసామి॥ అ॥ ఎంతో వేడుకతో నెనసిముచ్చటలాడి - వింతరతులగూడవేళ సమయముగాదు - హాం తకారిబావవచ్చేటివేళాయె - రంతులుచేయకురచ్చికోర్వనుసామి॥ తి, ౧॥ విరులపాన్పుపైని వేడుకలరగాను - గురుకుచములజేర్చుకొందునిక నొకసారి - మరుగులేకనాతో - మనసిజుకేళిని - నిరవుగానుండితేచాలును నాసామి॥ తి, ౨॥ గుత్తగానివలె నిత్యానిత్యావచ్చేవు - అంతకంటె మోసపంగడిబెట్టు - చిత్తాననెనరుంటే చేరియుండగావచ్చు॥ వత్తురెవరైనవడిగాగూడరసామి॥ తిన్నగ, ౩॥

కాపిరాగము - చాపుతాళము.

౧౫౦. చారుబూరుమనీపరుగులుపారితే పాటపాడవద్దటే - తంబుర మీటి పాటపాడవద్దటే॥ ప॥ నగిరినారాయణవనముచీరెగట్టి - నగరి వద్దకీఘన నాయకివలెనే॥ అ॥ ఉసిరికాయనవిలి ఊటనీళ్లుతాగి - లిసువుమోపెడుకోసి యసుతుసునైరె - పసుపునిగ్గుగబూసి పైటెలుకులుచేసి - విసవినొక చేతవిడ ముబట్టుకొని॥ చా, ౧॥ తుమ్మికూరచేలోతుంచుకొచ్చేనని - దిమ్మరియేడేడ దిరిగితివే - కన్నెకస్తురిబొట్టు నెమ్మోమునదిద్ది - సొమ్ములు దగిలించియెమ్మె కాంగ్రముచూడ॥ చా॥ ౨॥ ఏమళ్లలోజికేరుయిన్నినంద్రకాయలు - భూమినకరులకేక బుగ్గిఉన్నదే - కోపలియడిగితె కోపమెందుకేయిట్లా - భామరోవేణుగోపాలరాయనిగూడి॥ చా, ౩.

# యాసపదములు.



మోహనరాగము - అటచాపుతాళము.

౧౫౧. ఇచ్చేవాయీనీకిలేశోచ్చేవా॥ ప॥ రచ్చకౌను కంటరా సాలేమో యీడ - యిచ్చేవా యొకరూకయేనుగోపాల॥ అ॥ సంతకాడయింతసాపల్గు వంట సన్నోరయునేదు - యెంతప్రొద్దాయనే యేయూళకాడొస్తి - వేమన్న యీగోము - శింతోనమొద్దయూసన్నోడడిగెతలిపి శీపొమ్మంటి నాడు - యెంత చెప్పినఇవవు యికనేమూశనీగాను - సుంతకల్లసూడు - మంచోడు॥ ఇ॥ ౧॥ బ గుమానమిప్పించేటగిసేహ యీమూతి పాశళకుందంటివి - నగరిదబ్బసళిన్నా గిశేతిలోబోసినతుసూశిదాగుంటివి - అగసాలచ్చిదంతో అన్నెలమంగసన్నాడి రోసుకుంటివి - యిగతామాశిరె శప్పియేళనం శేళి సొమ్మెగయేతమంటుంటివి- మస్థంటివి॥ ఇ, ౨॥ దోశాలయుందర హాళారినగదో దాశికిరమ్మంటివి - పాశిన రికూడుపాణకమింతిచ్చి పాతకలెకంటివి- ఓశోసి సనసన్నోన్నగ ముప్పాతి కిశెప్పి వద్దిగ్యావద్దంటివి - గాసిపెట్టినాతో కలసుండి ఛీఛీ యేడ్రేసి పొపో మ్మంటివి- లెస్సంటివి॥ ఇచ్చేవా, ౩.

నాథనామక్రియరాగము - చాపుతాళము.

౧౫౨. నచ్చుత్రంబోయ్యొత్రామే - చంద్రమామాశి- నచ్చుత్రంసూశోత్త మే॥ ప॥ లద్దుముళవ్వారు ద్రుంరపునేమాగొల్లెందు - పచ్చిబిమిళిరిపుడ్పైనా సంటుంఘాడు॥అ॥ బోగమాల్లాడే డేరంతే- శింతనిగల్లో- వాగనాతేడికంటే- హాగిజైమెడయుండనూకటమిపరీతం - తాగనీలుందెంటనదలొట్టేదంటే॥ న, ౧॥ బారుకుంగ్గవంటనే - శిన్నెంద్రూకు స్త్రాంగుపందేశ టనే. సుడమరొ త్తావంటగనూపినె లేసొని - అరివంద్రకట్టియూడేరంటేశాలుకు॥ న, ౨॥ ాగరుశేల్లుందెంటనే - శాశీశిరేస్తేతగరవుంగరమో టెంక్టె-యిగనేసుమండ ౦ మెవకలి టోయుండాయి - నేగిరోకోచ్చేరంట బగుమెడిగణ్నటు॥ న, ౩॥ ౦త్తచింబాళంటనే- శేపించిందగిత్తూరికాడంటనే । నా త్తూకరతమావనూర ంటుండావో -నెత్తిపాగినుతలె త్తిపూసేకలి॥ న, ౪॥ లందనలుందంటంటనే ంగ్గాకిశందిశమింతంటనే । ఉందెంటితబెల్లమేశేనసిష్టల్లు । కొందాంరాయే మేనుగోపాలుడుండాను॥ నచ్చు, ౫.

## పంతువరాళి రాగము - చాపుతాళము.

౧౫౩. నాన్నారముచట్లో నానాదించుంగొంట। నయమునిచ్చేరంట నే॥ సూ శే॥ ప॥ యీస్నెహొద్దెక్కనేయీడేమండా దెంటే। కోణ్నిగొండవో తెకొండురే వాగుర్రైన॥ అ॥ ఇలనేడసూల్లేడే। యీసుల్లేవగ్గవే- మలుగుశా పలాడమస్త టన్నే - తలమొంటికెతాల్లుసిలువు పొదుగయీనె - అటశొచ్చేత లీ్రాడఅంబలొంచుండేర• నా, ౧॥ అమ్మోరంటిత్తలికమ్మలుంగరాలు। తెమ్మ నిస్త్రీశ్లుతమ్ముశాతా। తమ్మోరకు్రదోటగురువ్రఅగుమూడెల్మ్సి। చామ్మగచూ డాలెహోస్ర్టె గుండాలే• నా, ౨॥ మోడోల్లశెన్నెంగుమెట్టెలకంటొచ్చి। మేడి దోచలుతన్నోరెంతుకొరి। ఆడస్సీల్లునాగ అగ్గేలేసురుకెత్తి। సూడాలేదేపుల్నే సూతమేడిగున్నే• నా, ౩॥ అబిడిప్పటికీను లెంతచింగరమే। నటురుకొక్క మోంచనాన్నెయుగా- పెబువేగాయింనెనోబెక్కిసిమింటెనో। సుబిలమైయుం డుయీంసూనదీయంశాత• నా, ౪॥ కాళిపోడు గెటకీనకలద యీగొపీరం। యే శశిలుగల్లా మెగిరేరేమే। ఓకయ్యోర్లుగుమురైవాపోయి కేచులమిద్ద। పాశపు కూడేగో పాలుచదయచేత• నా, ౫.

## ఆంభిరాగము - చాపుతాళము.

౧౫౪, అగ్గితెసనాళ్ళంట అజ్జునికతలంట। ఓ నాయెందరసోగ్గమే। భాగతకత- ఓ రామెన్నిన్నింతలే॥ ప॥ సుగ్గిజయముదీనిసుట్టబలాదూడి। అ గ్గురవుఅయ్యోర్నడి గేసిసాచ్చిగ॥ అ॥ ఇగనేలుప్తై నెకెపయి బీసనూడొచ్చి బగుపెగ్గేలేన్నెనోన్నె బలికిదశ్శొసూని। మొగమచూడగానె మెర్చనాయాల బ్టె। గుగుమిగురనకుండగుడ్డెల్లగుకేసే• అ. ౧॥ అనుమంతెనకటోడ అబి మన్నడంటనె। సనియునేలెఒట్టసాము శేయచుఅట్టె। యినవేయీరబద్రు యుసనకాయాలుదోక్క - కనురెప్పె శేతలిక్కటణిసిశించేసె• అ, ౨॥ ఇరన్నె చ్చుచడ్డసుతంద్రజత్తొకరెయ్యు। దురివోదననిఘయిలోదూరిముకనన్లో-అ రశిపిసాశొలెఅశ్నద్దామనుమింగ। సురిఖోదచూమెనెసూడవేడీగున్నె• అ, ౩॥ భేరిబూరుగలెంట గారదేవలమెద్ద। యీరపరిమెగమొక్కి యిటు తలెత్తే కి మానుచాసోద్దొకపుమెలతెత్తొవలించుకొని- శారిదైపిశెపదొ బనల

శ్చైనేనిపు. డ. ౪॥ తేనేగగులోలేతెండె తెండె గపంజ - కోనవమ్ముద్రంగంట కొనమునిల్పడిసూడే- నాతాడించంగన్లానా వరవంతోలే వేనగోపాలుడ మెటుల గాయించవనే. అగ్ని ౫౬, ౫॥



# మెరటూరు వేంకటరామశాస్త్రులవారి చిందు.



నాథనామక్రియరాగము- ఆదితాళము.

౧౫౭. తళుకు బెళుకు కులుకు గలమిటారిరా- వేరా- నా సామి॥ ప॥ తళుకు బెళు కులుకుగలమిటారి - వలపు చెలువు సౌఖ్యపు చూపులదారి- కటికటిచిన్నారిపొన్నారి ఓయ్యారి- ఘనుడమల్లాజేంద్ర నిను గోరి అ॥ అలపగడాల సొలపు జిగిడాలు- అలరుజాతి కెంపులనగజాలు- చిలుకసజీకికెంజేగు జాలు- చిలుకలకొలికివా తెరజిగిడాలు - సులలితనయగుణమాలగల ఇంతిరా వలరాజుదంతిరా- చెలువలరిన చెంగలువబంతిరా - రత్నాలదొంతిరా - యలగలలల - వేల్పింతిరా- నేమ్మోవిని కాంతిరా- తెలివగు మిరుపులలోనడిదంత్రిరా- సౌభాగ్య గౌదరా- తేలికలువల చెలువుని మేనల్లునిగేడ్లూ- చారడేసికండ్లూ- పొలుపు మీరిమురిపుటవిలుతెగరనికొండ్లు- మల్లెపూలచెండ్లు- వెలలేనిమెరుగురంగగు బంగరుగిండ్లు- గజమ్మపండ్లు- వనరుహాలోచనజిగిబిగిగలపాలిండ్లు- వయసుపన్నెండేండ్లు- పలుకుపలుకులకు తేనియబోలుకు- నలరువిలుతునికి తేరినములుకు- నలరుకనులప్రేమరపముజిలుకు - నదియేమోబహుముద్దులగులుకు॥ త, ౧॥ అళికులములుచంద్రకములనేలు- నంబుదములు చొక్కపు సీలాలు- వేమిగలికినన్నెరికరుడాలు- హేమాంగికామరపాయపురాలు- కలికియాటపాటలలో ధాటిరా- యాదవీణమీటురా- కామశాస్త్రతంత్రములలో సూటిరా- సుగుణాలపేటిరా - యలసవింటిదొరకు దుఘోటిరా- మరియాదబోటిరా- కలువకంటిసురతమసకిరీటిరా-సరసాలమేటిరా- కిలకిలనగిరతిసగలననిను తేలించూ- చాలనలాలించూ- గిలిగింతలగావిసీమనసును మెప్పించూ - రతిదేవిని మించూ- చెలువునబంధవివేషంబులసరింహాచెప్పుమనేమంటూ- కరికరలీలలసలిపినమక మెచవించూ- మాకిమిగా వించూ

మెలఁగవ తెరుగువగలదదిశానా- తెలివియోర్పునేర్పులకదిజ ౯- నేలతకసరిసాటి
నెవరిగాన-నరజాణత్వనీకైవదిచానంత,౨॥ మొగము నెరతొగలరా యాసిగేరు- మోం
హనాంగిబల్సొగసుబిడారు- చికిలియొగలకనుబొమ్మలతీరు - చిలుకవజీరుసిం
గాణినిసురు- సిగనిగమనుచెక్కులుముకురాలురా- గునిశాడువాలురా- నెన్న
డురలనెలవంకనుబోలురా - కడుముద్దురాలురా - జిగిబిగిగానికౌగిలించజాలు
రా- యాపనికిమేలురా- వగవగనినుకలసి మెలసియేలురా- ప్రేమాలవాలురా
మగువలలోపలనిదియేమిగులవితరణీ - యలమధుకరవేణీ - బిగువులాడినీకేతెగి
నదియాతరుణీ - యదియింద్రాణీ - జగతిలోనమేలిమిగలవంటపూలసరణీ- చిగు
రాకుబోణి-సరిలేనిమురువుగలజవ్వాజిభరణీ - మేలయినరాణీ - తగివెలసినగిం
గాకట్ధీరా- దత్తాజీకమలాంబకుమారా- మగువనుచేకొనియేలుకొరా- వం
గళకరన్లాజిహొజీరాంతలుకు,౩.



# మల్లికార్జునిపదము.



సురటిరాగము-ఆదితాళము,

౧౫౬. సొమ్ములుసొలుచుసుందరివచ్చెడి సొగసుజూడరమ్మా ॥ ప॥
చాకులుపుటరవిరిసుగటచేవిసరుచు - చక్కనికృష్ణునిపక్కనురారీ- సరిసరిగా
కలశీ- మెలసి॥ అ॥ కుసుమాయుధునర్చించుతెరంగున - కొప్పునవిరులాకటాక
టిగజారా - విసుకవేకువజాముచందురుని - విధముమముఖకళవెలవెలబారా -
కొసరికొసరిమురిసీ- కోకిలకొరికికొరికికొరికిమానిన పసగలలతిమరులిపీని -
నగుగతరసజవకంబగుమోవితో - కడురంజిల్లెడుమైతావితో- వాకపరినిద్దుర
జోకతో - నెరయొంటికట్టుముడికోకతో - మిసమిసమనుచును మిట్టలెబదను -
పసుపుపిగ్గుగలపమ్మెవజారగ సొమ్ములు, ౧॥ గగనతలంబున సంధ్యారుణరుచి
గలిగినచుక్కలు పెనగొనుజాడా - జిగిబిగిరత్నపరమ్ములుమడిపిడి - చిక్కు
బడినభారములసియాడా - మగువనమముకుటికి - మృదుకుచయుగభరమున
కళికే - బెళుకగమొగమున నెరనెల - తగిలినరోహిణి వగముందర నటియింం
పగా। ప్రియవాక్యముచిలుకగుణింపగా। వినుమగుడియతాళ్ళ జనింపగా

నల్లమనుమశరమ్ములనింపగా । నగధరుకనుగొని నగికేగంటను । చిగురుబోణి గనిసిగ్గునమెల్లనే॥ సో, ౨॥ చల్లనిమంచుతెరంగునభాసిలు । జంటపసిండియు లంటులలీలా। తెల్లనివలిపెవుపావడలోతోడ। లుల్లసిల్లిగనమనియాడ। మొల్ల బంతిపట్టి। పాపలునురువుమీరమెట్టి। అందలుఘల్లనిమ్రోయగ। శృంగారరస ము। వెల్లివిరిసిపైబారగ। తనయుల్లమువెన్నెనిగోరగ । మైరుల్లసిపులకలుదేర గా। నల్లనిసామినినళినదళాక్షుని । మల్లికార్జునిసమానుసిపెనగొని॥ సోకు దుసోలుచు, ౩॥



# కోసలపురివారిసంస్కృతకీర్తనలు.



### కేదారగౌళరాగము- ఆదితాళము.

౧. రంగనాయకభుజంగశయనసా। రంగవరదసంరక్షమాం॥ శ్రీరం॥ ౧॥ సాధుపాలనధురీణకేశవపు । రాణపురుషసంరక్షమాం॥ శ్రీరంగ, ౨॥పు ణ్యచరితకారుణ్యసాగరహి। రణ్యచేలసంరక్షమాం॥ శ్రీరంగ, ౩॥ పంకజాక్ష పంకచరితమత। రంగజనకసంరక్షమాం॥ శ్రీరంగ, ౪॥ బాధితామరవిరో బుధజనా। రాధనీయసంరక్షమాం॥ శ్రీరంగ, ౫॥ దీనసికరసంతానభూరు హవ । రానుభావసంరక్షమాం॥ శ్రీరంగ, ౬ । సూరిబృందసరసీరుహక్షపు రాణపురుషసంరక్షమాం॥ శ్రీరంగ, ౭॥ అంజనేయకరకంజసంక్రమని। రంజి తాంఘ్రిసంరక్షమాం॥ శ్రీరంగ, ౮॥ శ్రీధరప్రణవసాధకోసలపు। రాధినాథ సంరక్షమాం॥ శ్రీరంగ,౯॥

### కల్యాణిరాగము - ఆదితాళము.

౨. పాహిగోపవేషా। హరేమాంపాహి॥ ప॥ పాహిగోపవేషావి ధృతభక్తసర్వదోషా। గతమద। మోహాలోభరోషా । కౌస్తుభ। మాణిక్యమం భూషా॥ హరేమాంపాహి॥ అ॥ చంద్రకలవతంసా।దమితకంసా । పరమ హంసా। సదానమితేంద్రముఖ్య । విహగేంద్రవాహనో। పేంద్ర। కాళియో గమదహరణా॥ పా, ౧॥ భవ్యగుణకలాపా। శార్ఙ్గచాపా। పాగ్ధరూపా

చతుర్ముఖ। సేవ్యయోగివర భవ్యపద్మముఖ। దివ్యపద్మలక్షణాం చితపదయు, శా॥ పా, ౨॥ నందకప్రహరణా భూరికరుణా। కాళశరణా।గతావనసం నా। సనందనాదిమునిబృందవంద్యసకలజనశరణ్యా॥ పా, ౩॥ కంజదళనిభాక్ష సుజనరక్ష దనుజశిక్ష। ప్రవీణధనుంజయార్తిహర। మణిభూషణ। నిరం వాగణితనిరుపమలీలా॥ పా, ౪॥ దంతిరాజవరదా। రాత్రిచరదా। వాగ్నే రదా। ప్రజాశ్రీ కాంతయోగివర। చింతనీయవేదాంతకోసపురనిలయ॥ప హిగోపా పా,౫.

శంకరాభరణరాగము॥ ఆదితాళము.

౩. వందే గోవిందరాజం। సదా। వనతసురాసురరాజం॥ ప॥ అవి శి। ఇందిరాసుమందిరా। హితోరస్థలధర్మసంధరాఢిభాజం॥ అ॥ బాధితా జనశోకం। గురుభవపుణ్యశ్లోకం। సంతతిధేయసకలలోకం। పద్మాదృశీమణిప్ర శకం। స్వపదా। రాధకాళిబోధకారివరితో। న్మాధకారణాధికావలోకం వం,॥ ౧॥ శాంతానతగుణావంద్యం। విశ్రాంతామసురవేద్యం। వేదాంతనయ ప్రతివాద్యం। హృతతాసజనావాద్యం। కనకసభాంతరానిరంతరా। స్మితనం శాంతరాగనంతిరాజవేద్యం॥ వం,౨॥ భూరిశుభగుణజాలం। లంబూనదమయ దివ్యచేలం। ఘనసారతిలకీతనిటలం। కోసలనగరీపరిపాలం మానివతోరుజాష హారజాగ్రతం।వందారుజాత।పారిజాతలం॥ వం, ౩॥

భైరవిరాగము - త్రిపుటతాళము.

౪. రామాపాలయపాహిమాం।హరేసీతా॥ ప॥ రామారవికులసో మా। జగదభిరామా। సీరదశ్యామావశరథ॥ అ- సారదయావాహావీక్షణా గ ర్వసాధునికరసందక్షణా। శూరశుభాకరలక్షణా। దశవదనబాహుగర్వశిక్ష ణా॥ హరే, ౧॥ ఖండనజితఖరదూషణా। పరిపాలితవినుతవిభీషణా। అఖం డల్పారితదివ్యభూషణా। దండకావనమునిజనపోషణా॥ హరే, ౨॥ కానుపవ నిజసత్యభాషణా। మాయతనుధారిమారీచభీషణా। ఘోరవననిధిఘనమదశో షణా। మోహనరంగహారభజనతోషణా। ఇనతనూభవవినుతవైభవ। జనితకో సలమమితశరబల॥ రామాపాలయ॥ ౩.

సావేరిరాగము - ఆదితాళము.

౫॥ శ్రీరఘువరశుభకర-సీతారామమాంపాహి॥ప॥ సారసదళనేత్రా జగన్నుతజలధరనిభగాత్రా- భవసం - సారకలుషభంజనసుచరిత్ర - జనకజా స్యపంకేరుహమిత్ర॥ అ ॥ నవరసాల పల్లవమృదు పదయుగళా - నఖరుచిజిత తారక భువనమోహన విశ్రుతశంఖగళా - శివసన్నుతనామా । సద్గుణశీల పూర్ణకామా। నత వైరివసమోహరంజితసోమధామా- రవణముఖోగ్ర రాక్షసకులభీమా॥ శ్రీ ॥ ౧ ॥ విమలకుంద కుట్మలసుందర రదనా । రథగజాది పృథునా- తుములసంగరాంగణజితదశవదనా- కుముదారిప్రతాప। మోహన కోపబాలరూప । మదగజగమనసాంద్ర । సత్కరుణాలాప - కలిత శ్రీరామ చంద్రభూపా॥ శ్రీ, ౨॥ అతివిశాలకోసల నగరనివాసా। మణికుండలనీరాజిత కపోలతలచంపకసుమనసా- శ్రితజనమందారా - యోగిజనచిత్తసంచారా - తతసుమహితవిశేషభూషణాలంకార। ఇనసుతాధికపిసైన్యోద్ధార॥ శ్రీ, ౩॥

బేగడరాగము - ఆదితాళము.

౬॥ కమలనయనయదువరమాంపాలయ। కపటగోపడింభా॥ ప॥ కమనీయగుణాభిరామభూసం। ఘటితిపటీరంభా॥ అ ॥ చరణనిహిత శకటాసురనిరుపమ- శౌర్యసమారంభా । కరికరనిభదోస్తంభా । ఆర్యార్చితజిత కాళియసారంభా- మురహరజంభా। రిపుగంభా। జరోషమదడంభా- హుంకృతివిరచిత హితమునివరసేవ్యా। మకరికావిలసిత రాధాకుచకుంభా॥ క, ౧॥ అతులితలావణ్యనిధానమనోహర మాల్యసుగంధా- అన్వతకరనిజసంధా । పరిభూషిత రాసంధా- బుధహిత సంధామకరంధా - హితమందరగంధా । నేకవిహితసమ్మదితామరగణవిధ్వం। సితశరగాగతభవబంధా॥ క, ౨॥ దమితకలుకోసలపుర। వరనగ। ధారణసోత్కంఠా - కంసమర్దన వైకుంఠా । దనుజాహితనీలకంఠా। ధరసమకంఠా - శితకంఠ జనందితకుంఠా స్మెకద గణమనిజ కీర్త్యా। మనేర్మగృహాయుత। ఘనయమునాసలిలదపకంఠా॥ కమల, ౩॥

బేగడరాగము - త్రిపుటతాళము.

౭॥ పాహిమాంశ్రీరఘునాయకా- భద్రదాయకా। భాసురకోదండ నాయకా॥ ప॥ పాహినిశమదవిదారక- నిరయతారక-పాలితసూర్యసుమారక।

ఖలసంహారక॥ అ॥ ద్యుతిజితహితవిరోచనా - జలజలోచనా । శ్రితజనా ఘవిమోచన। కృతకాకాసురదండనా । రుచిరమంచనా - ఖేచరసన్నుతభంజనా- వైరిఖండనా॥ పా, ౧॥ మునిజనక్లేశభంజనా- లోకరంజనా। దనుజమేచకప్రభంజనా। దినకరకుల భూషణా - దీనపోషణా । వినిహితఖరదూషణా। మంజుభాషణా॥ పా, ౨॥ ధరణిసుతయారమణా। వాలిమర్దనా-దానవేద దమనా। గురులాంఛ్యజితమదనా కుందరదనా। కోసలపురసదనా- చంద్రవదనా॥ పాహిమాం॥ ౩॥

అసావేరి రాగము - త్రిపుట తాళము.

ప॥ మామవరఘువీర- మానితమునివర॥ అ॥ భూమిసుతానాయక। భక్తజన- కామితఫలదాయక। గర్వితసూత్రామతనయువిరామ- నృపతిలలామ- సమరోద్ధామ - దశరథరామ । దశముఖసామజ మృగేంద్రా । కోసలపురీంద్రా॥ అ। దినకరకులదీప। ధృతదివ్యశరచాప- వనదసన్నిభగాత్ర- మానివర్య। సనకాదినుతపాత్రా। నభోమణి। తనుజశరణ। పవనజముఖహరి । జగద్ధిత। దనుజమదహర। మనుజతనుధర । వనజదళనయనా । అమితయశసదనా॥ మా, ౧॥ భండనోద్గతరోష । పాలితగౌతమయోష। దండితమారీచ । అబ్ధిగర్వఖండితనారాచ - దివ్యరత్న । కుండల కలితగండయుగవేదండ ధరభుజ। దండహిమకర। దండధరకో। దండ దళనయన । అగణితగుణగణ॥ మా, ౨॥ ఘటిలనారాభూష- కలితాశ్రితవిశేష। తటిదుపమితహాసన కోసలపురభవన। నివాసన। ఇంద్రనీలాభా - కుటిలకచధృత - నిటలతటమణి పటలఖచితమ। కుటిలసితమృదు- చటులపితనుత । జటిలమూలధనా। దరహసితవదన॥ మామ॥ ౩॥

అఠాణా రాగము - ఆది తాళము.

ప॥ శ్రీరుక్మిణీశ మాంపాలయ। వరగుణాలయ॥ప॥ జారచోరశిఖామణీ। సాధుజనచింతామణీ॥ అ॥ ధన్యవసుదేవనందనా । తనుధృతదివ్యచందనా। జన్యజితసంక్రందనా- చతుర్ముఖకృతవందనా॥ శ్రీ,౧॥ మునివేశితబృందావనా। సుధాకరకులపావనా ! సనకాదిమునిజనావనా । సకలగోపిక

### కల్యాణిరాగము - ఆదితాళము.

౧౨॥ రేమానసచింతయామి నీరంద్రం॥ ప॥ రామానుజముని కరుణా సాంద్రం॥ అ॥ అధికతయామున మునిసాంప్రదాయం । అమితదయాం పర నిజనామధేయం॥ రే, ౧॥ గోష్ఠిపూర్ణాఖ్య గురుదయాపాత్రం । గురుతర జననీహారితసగోత్రం॥ రే, ౨॥ ధృతకాషాయ వసనత్రిదండం । శ్రీపతిమత సంస్థాపనశౌండం॥ రే, ౩॥ గురుమంత్రవితరణైకధురీణం। గురుతరదయాపావని జనామనోహరం॥ రే, ౪॥ కోసలపురవరభక్తావతంసం। కుటిలమదాంధకారక హంసం- రేమానస, ౫॥

### సురటిరాగము- ఆదితాళము.

౧౩। కరుణాబ్ధే కృష్ణావమాంతక గణాంబుజేక్షణ॥ ప॥ సురతచరితక్షణ సామ్రాజ్యోద్విత। పరమహర్షభర। పరిపక్వైకభా। సురశరీరజారచోర- గోపకిశోర తారపర। చారుకంధర॥ అ॥ దనుజకంధర । శతధార । శతభృద్దనుజ ధృదశతాంగ్రఘ। వనహేతావతార। ఖల। జనవిదారణోత్సేదార। బృందావనవిహార। శుగపహార। భక్తావనవిచార । గగనచారణవ్రజ। వినుతసార నిజమసారదేహాత॥ క, ౧॥ సితకరాన్వయవ। తంస। వంశల। సితకరామారాధ్యత। వితతగీయమానా। ఫణిపతిశయాన। పతగయాన। మందాస్మిత యుతానన। నత్యుతానసుధిక। సుకృతనిధాన । సధపధాన। సంరక్షితవితాన। నతవితానతోషణ॥ క, ౨॥ పరతరవైకుంఠవల్లభదయా । పరతతపతాపా। గయపరి- హృతాఘతాప। శ్రితసురతరోప। యోజరోపణాయుత । సరస రూప। జాతరూప। మణినాస్వరకలాప। కేవలాప॥ చరితనికరగురాప। శుభ కరాపవగదా॥ కరు, ౩॥

### కర్ణాటసారంగరాగము - అటచాపుతాళము.

౧౪॥ పాలయరఘునాయకా॥ ప॥ వైరిమండల- పాటనపటుసాయకా॥ అ॥ ఘోరనయనసేవ్య। పంకజాతవదన। నీలవారిదదేహ - నిత్యానంద పాలక। చేలవరగుణ। జాలవరమణి। ...లసుకృతను కూలనిరుపమ॥ పా, ౧॥ భీమకార్ముకవిభంగా । నిస్తులబాణ । భిన్నకనక సారంగ - కామదాయక సీతా- కాంత జగన్నుత। రమణీయవాస। రాక్షసంచరభీషణ। రామన్నృపతిల

లామజితభృగు - రామరవికల - సోమపటుతర॥ పా, ౨॥ కందసమదర శోభా- నేత్రజితారబిందపంకజనాభా- సింధురారుణాధర శ్రీసాకేతనిలయ- మందారితరువర- నిందకవితరణ- ఇందుముఖసుర-బృందపరిణత- చందనరచిత- సుందరతిలక॥పా, ౩॥

కర్ణాటసారంగరాగము - అటచాపుతాళము.

౧౫॥ పాలమాందేవ- కాంచనమయ- చేలసుప్రభా॥ ప॥ వ్యాళారి గమన - విశాలవక్షస్థల - ఫాలలోచనమిత్ర - ముకురకపోల- శీలలన మనో హార॥ అ॥ సరసిజదళనేత్రా- లోకేశాది- వరమునినుతపాత్రా- వరదభంజన దైత్య- నరవజర్ఝూనిల- వరదతురగదనుజ - పురమదహరణ - కరధృతధరగ ధాంగా॥ పా, ౧॥ అంగజశతరూపా - దామోదర - భంగశంకరచాపా- గంగాజనకసర్వ- మంగళనుతనామ - సంగరప్రియగానలోల- భుజగశయన- సారంగశుభదా॥పా, ౨॥ స్యందపురనిలయా-జనార్దన-కందసన్నిభకాయా- మందరధరముచు - కుందసంరక్షణ - ఇందుసుందరవదనా - సుమనస- బృంద వందితపదయుగా॥పా, ౩॥

కర్ణాటసారంగరాగము - అటచాపుతాళము.

౧౬॥ వాసవాదిగేయా - కొమ్మిపుర॥ వాసకేశవరాయా॥ ప॥ దాస జనహృ। ద్వాసముని వర - వ్యాసవందిత - నాసకల్మష - భాసహేమవి- కాసరజితగి - రీసవందిత - కేసబంభర॥ అ॥ గాంగేయమయచేలా - పోషిత సుర- గాంగేయస్తుతపాదా - గంగాజనకర- మాంగనావర- సంగనేత్రభు- జంగమత్తవి - హంగరాజను - భాంగనక్రవి - భంగకరివర - మంగళ ప్రద॥ వా, ౧॥ నక్షత్రేశవదనా - శ్రీకౌస్తుభ - వక్షవికుంఠసదనా- పక్ష విసరాధ్యక్ష - గమనరుక్షక్ష - వసుతిపక్షముర - మదశిక్షకమలద - శాక్షిక రహిత - రాక్షసాహిత - మోక్షదాయక - వా॥ ౨॥ పుండరీకనయనా- శ్రీగరిమా- తాండవవశపాలనా - పుండరీకభ - వాండమయబుధ- మండ రక్షితా-ఖండలానజ-ఖండితాహిత-చండకరనయ- నాండధ్వద-భండనోజ్జ్వల॥ వాసావా, ౩॥

సురటిరాగము- ఆదితాళము.

౧౭॥ కలయేహం శ్రీకమలే - తవపదకమలే॥ ప॥ జలజాతజాతదైవత
కనకా - చలశరాసనవాసవాదిసురగణ - లలితమకుటకలితనీలమధుకర - ఝళిత
హంసకేహృది॥ అ॥ కనకకుసుమలసమానమార్దవ- కాంతిసౌరభాంగి- దృగ్వ
నజజితకురంగి- మృదుఫణితిభంగి - ప్రణుతిసింగి - వరమునిజనతరంగ - తనుతి
భృంగి - సారసవనిభాంగి - తనులతాంగి - మణిసుమ - ఘనరాంగి - కదన
పాంగి - శశిముఖి॥ క, ౧॥ నీలనీలరుచిజాలవితరణ - నిబిడమహామవేణీ - పరి
పాగితగీర్వాణీ- శుకలీలవాణీ- లాలితాణీ- హృది॥ క, ౨॥ మందశూకవరశై
లపౌరస్థలజలజముఖీ-ఘనమందరదనపాళీ- కురువిందలాళీ- తేందుహేళీ- భూ
షణకందమూళీ- నందితాళికేసం- క్రందనాళివందనాళి॥ దళితరవిందకేళీ- సుంద
రాళికే-హృది॥ కలయేహం, ౩॥

కాంభోజిరాగము- ఝంపెతాళము.

౧౮॥ వాంఛితఫలదేహి మమ। పెరుందేవి శ్రీ। వారణాచలివాసినీ॥
ప॥ కాంచీపురాధీశ। కరివరదవల్లభే। కరిరాజతుల్యగమనే। దేవి॥ అ॥
సురగణశిరోమకుట। రత్నఖచితాంఘ్రికే। సుకుమారరమ్యదేహే। వరగుణ
గణాలయే। వరదాభయప్రదే। వైడూర్యరత్నభూషే। భరతవిధవాద్య
సంకీర్తనప్రియే। భక్తజనసులభశీలే। కరతలసరోరుహే। కమలాకరేశుభే
కల్యాణకోటినిలయే। దేవి॥ వాం, ౧॥ శుకకోకిలవాణి సుందరపయోధరే
సురసుందరీసమేతే। అకళంకచారిత్రికే। భాస్కరప్రియే। హారతాటంక
యుగళే। మకరకేతజనని। మధుకరనిపాలకే। మాణిక్యరచితకటకే। సకల
భువనేశ్వరీ। శ్రీ పెరుందేవిమమ। సౌభాగ్యకల్పలతికే। దేవి॥ వాం, ౨॥ క్షీర
దధిసంభవే। జగదేకకారిణి। శ్రితలోకపారిజాతే। వారిజదళాలయే। వైకుంఠ
పురవాస। వక్షస్థలస్థితే। నారదమునీంద్రాది। పూజితపాదాంబుజే। నళి
నసంభవవందితే। భూరిసంపత్ప్రదే। పుణ్యకోటినివాస। పురుషోత్తమాను
కూలే। దేవి॥ వాంఛిత, ౩॥

—•••(※)•••—

విక్రాల- నృసింహాచార్యులవారి- తిరునామములు.



సురటిరాగము-ఆదితాళము.

౧౯॥ యతిరాజపరిపాహిమాం। గో॥ ప॥ సతిమతాభిమతిసారత మర్థో । చితవిధావసురుచిరనిజశరణా । గతసమేత। చేత। నాతిపాపకృత జాతభూతిభూతసైభవ ॥ అ ॥ దళితకుమతమత । జాలపవనాంతరయశోవి శాలా। వరకలిజిమ్ము క్తిగోలా। ధృతలలితచేల । బధిరపాలమూకాఖిల । మనో ల్లసితసలలిత। శేషా । చలశుభాలయపరిపాల । చేతనకలువతూల । చటుల ఖేలనానిల ♦ యతి, ౧ ॥ అగతికాన్మసువిధేయదాస్యరసాగతాభిధేయా । వి మలగుణభాగధేయా । కృతభగవదీయా। జగదుపాయ । సన్యత్సగుణకాయ। నిగమగేయ। యాదవసగవరాయ । తతశుభదాయ । నిజపదయుగవిధేయ। జ గదుపాయవిగ్రహ♦ యతి, ౨॥ విరమెతేందిరాధీశ । యామునమునపదభినివే శా । ఘనమనుధనప్రకాశా । వరమునిముఖాశ। యప్రసకశ। భూతాఖ్యనగరీశ రవిసకాశ । వైకుంఠనగరీశ। హృన్నివేశ। పవనాశనకులేశ । ప్రణతశోభనా స్పద♦ యతిరాజ, ౩॥

సావేరిరాగము- ఆదితాళము.

౨౦. శ్రీ యతికులవరసముదిత । సేనాధీశమాంపాహి॥ ప॥ ఆయపద ంధానాస్వతంత్రో। పాయపదనిధా। చరమోపాయకృతసైభవలసమా ం। పరమవైష్ణవాధీనిధాన♦ అ॥ నవకామానిసుందరపట। రుచిపటలా। ప్రవి మలతర।ప్రస్ఫుటవిశారదా। భాసురపుండలసన్నిటల। భవమోహనవేషా। ప రాంకుశ।ప్రణుతసుగుణభూషా। లక్ష్మీధవహృదాంతర। వాసవిశేష। త్రివి ధచేతనావనపరితోష♦ శ్రీ, ౧॥ గురుపరంపరాగతరద । మణితులితా। కటిల సముదనీరస । వరనవవానలరూపవచోకలితా। గురుజనపరివారా। మదంతః రణతాపహరా । నటజిచ్ఛరణశేష । శేనేరమాధవ । శంఖచక్రముఖలసదవ తార♦ శ్రీ, ౨॥ హరినివాసనశయ్యసన । సుశీలాసా । అఖిలసుజనమోహస ం । వినాసితభూరపురానాస । పరమార్థవిచారా । పూర్ణాంతరప్రవణ

భాష్యకారా । యదుభూధరధరాధి। నాథజనకని। తాంతశాంతివాంత్యాదిగ భిరఁ ॥ శ్రీయతి, ౩॥

## ద్విజావంతిరాగము-ఆదితాళము.

౨౧॥ శ్రీమతేరామానుజాయా। శ్రీకరభక్తసహాయా॥ ప॥ దామసపర మతసామజసింహా। కామితఫలదాకరబ్రహ్మ ॥ అ ॥ రాజతులసి సరోజభీజ విభ్రాజదాసితపూజితా - రాజరవిసమతేజవినుతబ । ద్రౌజదిసజభోగిత గాజా॥ శ్రీ, ౧॥ ఘోరతరసంసారనీరద। భూరికృజితమారుతా।భూరిసద్గు ణహారఆగమ। సారదీనమందారోదారా॥ శ్రీ, ౨॥ శాంతోభయవేదాంతి । సంతతకాంతగురుపదచింతితా- స్వాంతపరమైకాంతదురితని । తాంతఘనజీ మంతానంతా॥ శ్రీమతే, ౩॥

## మలయాళప్రు-కులశేఖరమహారాజుగారి-కృతి.

## కమాసురాగము- ఆదితాళము.

౨౨॥ సారసనమముఖపరమవమా। సనకముఖవినుత॥ ప॥ పారరహిత భవఘోరకలుషహర। వారిరాశిపరిపరితమహీసదయా। అ॥ కుటిలభుజగవరఫణి కృతసుచిరనటనా। దేవా। గోకులనిలయపయోనిధిపూర్ణశశాంకా । నిటల తటలసితమృగమదతిలకను । నీలవారిదశరీరయదుతిలక॥ సా, ౧ ॥ మదనజ నకనవమణిమయసులలితహారా । శౌరే । మంజుళవచనవిమోహిత విబుధని కాయా। పదనతనిఖిలమనోరథదాయక। హాపజాగిరికులిశశరసదన॥ సా, ౨॥ సకలభువనభయహరణ పటుచరితజాలా। మేయా । సంతతంవిహారమేమనసీ హృదయాళో। ప్రకటలసదనుజభేదనలోలుస । పద్మనాభభుజగాధిపతిశయ న॥సారస, ౩॥



# గురుమూర్తిశాస్త్రులవారి - కీర్తనలు.

ధన్యాసిరాగము - ఆదితాళము.

౨౩. నీరజనయనదనుజవిదళచరణ- నఖిలభువనమోహనచరణా॥ ప॥ మారజనక సుకుమారజనకజా- మానసీయకమనీయసుగాత్ర॥ అ॥ మమతుభువనమశివసశిసువితరశి- మహితఫలమబిజచేతసిస్ఫురశి- గమనవిజితగజరాజరసిరసిక- కవిజనవచసిసంచరసికసదశీ॥ నీ, ౧॥ చటులకుటిలకుంతళమృదుళనురళ-చటువచనరచనకుశలసుపేశల-పటుతరకరుణాలవాలనీల_ పవనతనుజలోలసుభగశీల॥ నీ, ౨॥ కుశికనందనసవనపాలన- కునృపకుంతనసురమునిచింతన- శశివదనవామనగరుడగమన-వగిగురుమూర్తికవనజీవన॥నీరజ, ౩॥

దేవగాంధారిరాగము-ఆదితాళము.

౨౪. స్ఫురతుతేచరణనళినయుగళే- శిరసిమే హేకృష్ణా॥ప॥ దరహాసభాసవాదిసురబృందవరవందితనందితముచుకుంద॥ అ॥ నవజలదనీలదేహఖగవాహ- నతజనానుగ్రహ-తనుగ్రహ- వివనిగ్రహ- దురగ్రహ- విగ్రహ- సకలదనుజసంగ్రహవినిగ్రహ॥ స్ఫు, ౧॥ కలుషహరమాంబాలయ- కృపాలయ- కలిభయాభంజన- సురంజయ-విలసితహరివగఋషిసురంజయ- విమలకోణువపిమంజుకుంజయ॥ స్ఫు, ౨॥గురుమూర్తికవికృతిం-సునినతిం-గణితిం-సంప్రతిరసంప్రతిగురువరప్రీతి-మపిసుకలితిం- గురుతరంకలయసదకంకృతిం॥స్ఫురతు, ౩॥

మోహనరాగము- త్రిశ్రరూపకతాళము.

౨౫. సభాపతింహృదంబుజే- సదాభజేవిమలం॥ ప॥ విభావరీశశోభిభాళవిలసిత-- సంతతం- విశ్వస్థితమునిమనసం- స్వశ్వచ్ఛకమురుదధతం॥ అ॥ పాదాహతజనితతాళ- శింజన్మణివలయం- వాదాగలితభండీ- నటనకంఠనాభ్యుదయం- నాదాదికవీణాని- క్వాణాతిముదితహృదయం- వేదాగమనిలయం-మహనీయం- కమనీయంభువి॥ సభా, ౧॥ గానామృతపానరస-తోషనారదనుతం- నానావిధరాగకర- శారదాదిహసితం- తానము నగీయమాన - తిన్నరసంగీతం- సేనానిద్విరదానన- బోధనసాధురశితం॥సభా,౨॥ భరతకృతేతాం

డరనుఖీ- నటనముపరిశాంతం- భవానింసుభోజ్వలాచ్ఛ- మపిచతాపయంతం- వరకవిజనరచితమేష- ప్రీతింకురువంతం- గురుమూర్తికృతి - వనితాంబ్రంతం- సంహృత్యంతం॥సభాపతిం-౩॥

పాధసధప- ధపగసరి- గధాపగరి- ధపధసధా- ధపగరిసరి-గరిగపధప- పాగదధప- పధపధసా॥ ధపధసాస- రిరిగాగ- రిగాగరిస- గరిసధపధ- సరి సరిగరి-సాగరిసధ- ధగరిసధప- ధపగరిసరి॥సభాపతిం॥

## దీక్షితులవారి - కృతులు.

బిలహరిరాగము - రూపకతాళము

౨౮. పంచమాతంగముఖ గణపతినా- పరిపాలితోహంసుమ ఖేన శ్రీ॥ ప॥ పంచభూతాత్మకాప్ర- పంచోదయాదికరణవి- దించిహరిరుద్రనుతేన-పంచవక్త్రశివనుతేన॥ అ॥ వరదాభయపాశశ్రీణిక- పాలదంతమోదకమద్గరాఖ్యా- మాలాకరేణ- కమలాపురవిహారేణ - పురుహూతాద్యఖిలదేవపూజితవిఘ్నేశ్వరేణ॥ పం, చ॥ హరగురుగుహసోదరేణ- సురుచిరలంబోదరేణ- కరుణాంగగౌరతరేణ-కలిమలహరణచతురేణ॥ పంచ,౩॥

హంసధ్వనిరాగము- ఆదితాళము.

౨౯. వాతాపిగణపతింభజేహం - వారణాస్యంవరప్రదం - శ్రీ॥ ప॥ భూతాదిసంసేవితచరణం- భూతభౌతికప్రపంచాభరణం- వీతరాగిణంవినుతయోగినం- విశ్వకారణంవిఘ్నవారణం॥ అ॥ పురాకుంభసంభవమునివరప్రపూజితం- త్రికోణమధ్యగతం- మురారిప్రముఖాద్యుపస్థితం- మూలాధారాక్షేత్రస్థితంపరాదిచత్వారివాగాత్మకం- ప్రణవస్వరూపవక్రతుండం- నిరంతరంనిటిలచంద్రఖండం- నిజవామకరవిధృతేక్షుదండం ॥ కరాంబుజపాశబీజాపూరం కలుషవిదూరంభూతాకారం- అనాదిగురుహాలోషితబింబం- హంసధ్వనిభూషితహేరంబం॥వాతాపి॥

మేఘరంజిరాగము- రూపకతాళము.

౩౦. వేంకటేశ్వరయాదవ- భూపతిమాన్యయోహం - విశ్వవికల్పాపహం- విద్వజ్జనకల్పభూరుహం- వదనసరసీరుహం॥ వేంక॥ కంఠశైలమూధీశ

స్థిత- కార్తికేయశివగురుగుహ- కనకాకటాక్షపాత్రం- కంజదళాయతనేత్రం- కంకణహారకిరీటాలంకృతం- సుందరగాత్రం- కాంచనవృష్టిప్రద-మేఘరంజితబహుగాత్రం॥ వేంక॥ సంకటహరణనిపుణతర- సకలనిగమాగమస్తోత్రం-సంకల్పవికల్పరహిత-సచ్చిదానందమాత్రం। వేంక॥

మాంజీరాగము - రూపకతాళము.

౨౯. రామచంద్రేణసంరక్షితోహం - సీతా॥ ప॥ రమాభారతీగౌరీరమణస్వరూపేణ। అ॥ కామకోటిసుందరేణ - కరధృతమందరేణ- కోమలఘనశ్యామేణ - కోదండరామేణ॥ మామవహృదయస్థితేన - మారుతిగీతామృతేన మాంజీరమణిమండితసద్గురుగుహమానితేన। రామ॥

నారాయణిరాగము- చాపుతాళము.

౩౦. మహిషాసురమర్దనీ-నమామి॥ ప॥ మహిషమస్తకనటనవేదవినోదినీ- మోదినీ- మాలినీ- మానినీ- ప్రణతజనసౌభాగ్యజననీ॥ అ॥ శంఖచక్రశూలాంకుశపాణీ- శక్తింసేనామధురవాణీ- పంకజనయనీ పన్నగవేణీ- పాలితగురుగుహాంబపురాణీ॥ శంకరార్ధశరీరిణీ- సమస్తదేవతారూపిణీ- శంకరాలంకృతాజననీ- కాత్యాయనీ- నారాయణీ। మహిషా॥

భైరవిరాగము- రూపకతాళము.

౩౧. చింతయమాకందమూలకందం- చేతః శ్రీసోమాస్కందం॥ ప॥ సంతతమఖండసచ్చిదానందం, సామ్రాజ్యపదచరణారవిందం॥ అ॥ మంగళకరమందహాసవదనం- మాణిక్యమయకాంచీసదనం- అంగసౌందర్యవిజితమదనం- అంధకసూదనం కుందరదన.॥ ఉత్తుంగకమనీయవృషతురంగం- భైరవీప్రసంగం-గురుగుహాంతరంగం- పృథివీలింగం-చింతయ॥

మనోహరిరాగము- త్రిశ్ర - రూపకతాళము.

౩౨. శంకరమభిరామమనోహరం- శశిధరమమృతఘటేశ్వరం- భజేహం॥ ప॥ శంఖాభిషేకగాత్రం - సచ్చిదానందమాత్రం॥ అ॥ పలకజాసనాది పూజితార్ధపదం- భక్తమార్కండేయాయుష్ప్రదం॥ భయంకరఘోరరూపకరయమాగ్రహానుగ్రహం-పంకజముఖగురుగుహపరిపాలం-కృపాలవాలం॥ శంక

మాధవమనోహరి రాగము- ఆదితాళము.

౩౩. మహాలక్ష్మీకరుణారసలహరిమామవ- మాధవమనోహరీ- శ్రీ॥
ప॥ మహావిష్ణువక్షస్థలవాసిని- మహాదేవగురుగుహవిశ్వాసిని- మహాదేవప్రశమ
నిమనోన్మణి- మారజననిమంగళప్రదాయిని॥ అ॥ క్షీరసాగరసుతే- వేదనుతే-క్షి
తీశాదిమహితే- సురహితే- భారతీరతిశచీపూజితే-భక్తియుక్తమానసవిరాజి
తే॥ వారిజాసనాద్యమరవందితే- నారదాదిమునిబృందనందితే- నీరజాసనస్థే-సు
మస్తే-సారసహస్తేసదానమస్తే॥ మహాలక్ష్మి॥

దేవమనోహరి రాగము - రూపకతాళం.

౩౪. భారతీమద్విషయజాడ్యాపహే- త్వద్భక్తకల్పకమహీరుహే-ము
ఖాంభోరుహే-శ్రీ॥ ప॥ కారుణ్యసుధాలహరి- కంజజదేవమనోహరి- శారదే
వాగీశ్వరి- శశికుంతధవళభాస్వరి॥ అ॥ వల్లకీపుస్తకాభయ- వరదకోమలతరక
రే- పల్లవాంఘ్రియుగళమణి- ప్రకాశమంజీరధరే- ఫుల్లసరసిజక్షేత్ర-పురస్వ
ప్రీతాంకరే- వల్లకీవిధిపరిహార- వాంఛితార్థవేదరే॥ మల్లికాకుసుమార్జితత్రి-
మాయాకార్యవర్జితే- వల్లీశగురుగుహానుదేవాదితోషాంతాణయుతే॥ భా॥

కమలామనోహరి రాగము - ఆదితాళము.

౩౫. కంజదళాయతాక్షి- కామాక్షి కమలామనోహరి- త్రిపురసుం
దరి॥ ప॥ కుంజరగమనే-మణిమండితమంజులచరణే-మామవశివపంజరశుకి- పంక
జముఖి- గురుగుహరంజని దురితభంజని-నిరంజని॥ అ॥ రాకాశశివదనే-సురద
నే-రక్షితమదనే-రత్నసదనే-శ్రీకాంచనవసనే- సురసనే-శృంగారాశ్రయమంద
హాసనే॥ ఏకానేకాక్షరి- భువనేశ్వరి- ఏకానందామృత- ఝరిభాస్వరి-ఏకాగ్ర
మనోలయకరి- శ్రీకరి- ఏకామ్రేశగృహేశ్వరిశంకరి॥ కంజదళాయ॥

సరస్వతీమనోహరి రాగము- రూపకతాళము.

౩౬. సరస్వతీమనోహరీ- శంకరీసదానందలహరీ- గౌరీ॥ సరసీరుహా
క్షి సదాశివసాక్షి- కరుణాక్షి- పాహికామాక్షి॥ మురహరసోదరి- ముఖ్యాకా
హారి- మూకవాక్ప్రదానకరి - మోదకరి॥ సర॥ అకారాద్యక్షరస్వరూపిణి

అంతఃకరణి- రూపేక్షుచాపిణి- ప్రకాశపరమాద్వైతరూపిణి- పరేశపురసుం
దరీ-చాపిణీ॥ ప్రకల్పితప్రపంచప్రకాశిని- ప్రసిద్ధగురుగుహజనని- పాశిని- కల
ల్పజటిలవిశ్వవిశ్వాసిని- నిజముకాంచీనగరనివాసిని సరస్వతీ॥

సరస్వతీరాగము-ఆదితాళము.

32. శ్రీసరస్వతీహితే - శివేచిదానందశివసహితే- శ్రీ॥ ప॥వాసవాది
సహితే-వాసవాదిసహితే॥ అ॥ కామకోటినిలయే కరధృతవణివలయే - శో
కలతరహృదయే గురుగుహానందయే-మామవసదయే శ్రీసరస్వతీ॥

సురటిరాగము - ఆదితాళము.

3౮. బాలసుబ్రహ్మణ్యంభజేహం-భక్తకల్పభూరుహం- శ్రీ॥ ప॥ నీల
కంఠహృదయానందకరం-నిత్యశుక్తభుక్తముక్తాంబరం- అ॥ పాలాయుధధరం
సుందరం-పరమాద్వైతంతపోదచతురం-ఫాలాక్షగురుగుహావతారం- పరాశ
క్తిసుకుమారంధీరం॥పాలితగీర్వాణాదిసమూహం- పంచభూతమయమాయా
మోహం-నీలకంఠవాహంపుదేహం- నిరతిశయానందప్రవాహం బాలసు॥

# శ్యామాశాస్త్రులవారి - కృతులు

సావేరిరాగము-ఆదితాళము.

3౯. దురుసుగాకృపజూచిసంతత । మరోగదృఢ। శరీరముగసలుపున
॥ ప॥ పరమపావనినృపాలనివినుత।పదసరోజక్రణుతాధిహరురాణి। పరా
ధర్మసంవర్ధని।పహుపరాకమలగణా।త్రిపురసుందరి॥ అ॥ నీసన్నిధినిజేరిగొలి
చనిన్నెపుడు దలచేసజవా। దాసజనభాగ్యమెటుదెలుపుదనో। ఓ। సకలజననీ
ను। ఓంకారిణియతి మేటులననీసాటెవరిజగంబునను । నేదానిజెలిసికొలి
చెనిని దు, ౧॥ ఏమోకలకజెందిమనము ననే నెచటగతెగానకనూ। నీమహిమలెల్ల
వ్రతేనఃఖునినియామనసులా నిశితదీక్షుటకేవేళబహునిపుణవని । కామాక్షియు
వేరేననుగా।దనిశలచిశ్లోకిచితిని దు, ౨॥ ధారాధరశనీలకచలసితా। సాస

కవితానిచిత । సారఘన। సార । సితదరహసిత। వారిరుహ। వారివదనోచిత వాగీశవినుత।భృతనత।నారాయణి।శ్యామకృష్ణనుతనా। మనవినివిను గిరిసుత॥ద॥ నిధానిపధమగరిని - ధమాగరిగరీ - సారినిధసరిమపధా - నిపధసరిస - మః సరోజనయనఽతజ । నపాలీనీవనీ। వేదములు మొరలిడగా । నితరులేవరు । మః మధపసనిధరిస। గ రీ స ని ధరి పానిధపాగరిని॥దురుసు॥ వివినికృపసలుపు। పరాకుసలుపరాదికనీపుడు॥ దురుసు॥ } ఇవిముక్తాయి. స్వ

కల్యాణి రాగము - చాపుతాళము.

౪౦. తల్లినినునెరనమ్మినానువినవే॥ ప॥ ఎల్లలోకములకాధారమైయు న్ననా॥ అ॥ ఆదిశక్తినీవుపరాకుసేయక। నాదరించుటకీదెమంచిసమయముగాదా సరోజభవాచ్యుతశంభునత।పాదనీదుదాసానుదాసుడె॥ త, ౧॥ దేవినీదుసరిస మానమెవరని। దేవరాజమునులునిన్నుబొగడగ। నావెతదీర్చిబిరానవరా।లొసగి నన్నుబ్రోవనీజాలమేలనే॥ త, ౨॥ శ్యామకృష్ణపరిపాలినిజననీ। కామితార్థఫలద కంజలోచని। కౌమారిరాణిపురాణిపరాశక్తి।కామకోటిపీఠాదివాసినీ॥తల్లి, ౩॥

కల్యాణి రాగము - త్రిశ్రజాతి - రూపకతాళము.

౪౧. బిరానవరాలిచ్చిబ్రోవుము।నినునెరనమ్మితి॥ ప॥ పురారిమనోప రిణి।శ్రీకామాక్షి॥ అ॥ తామసంబుసేయకనీవు। కరుణానిధిగావా । పురాణః ధునవాణి। శివునిరాణిగదా॥ బి, ౧॥ కామితార్థదాయకిదేవి। నతకల్పకలతిక పరాముఖమికన్యాల।వినుసరోజముఖి॥ బి, ౨॥ శ్యామకృష్ణశోదరిగౌరి। పరః శ్వరిగిరిజా।అనాదరణతుణంబుసలిపితేవినను॥ బిరాన, ౩॥

ఆనందభైరవి రాగము - చాపుతాళము.

౪౨. మరివేరేగతియెవరమ్మ- మహిలోబ్రోచుటకు॥ ప॥ శరణాగతర క్షకినివేయని-సదానిన్నునమ్మితిమీనాక్షి॥ అ॥ మధురాపురనిలయవాణి- రమాసే వితపదకమల - మధుకైటభభంజనికాత్యాయని - మరాళగమనశిఖమూంతవా సినీ॥ మ, ౧॥ వరమిచ్చితీవరమేబ్రోవుశివ - యింబయిదినీకుబరువ - నెరదా

పుణ్యపుగదాశంకరి- సరోజభవాదిసురేంద్రపూజిత॥ మ॥ ౨॥ శుకశ్యామలఘన
శ్యామకృష్ణుని- సోదరికౌమారి- అకళంకకళాధరిబింబాధరి- అపారకృపానిధి
వేరక్షింపు మరి॥ ౩॥

సా-ధ ప మగ- పమగమగరి-గామప- గమ ధ పమ గరిసగమ-పమగమ గారి
సా- దయయుగము- మదినిదలచి- కోరితి - వినుము మదగజగమన - పరులనుతింప
రి- నిస ని గ రి- ని ని స స- గగమమ- ప మగగమా- ప సనిధప- నిధపమ-
నే- వరమొసగు - సతతము- నినుమది - మరువక నే - మదనరిపు - సతినిను-
ప ధ మ ప గ రి- పమగరిని - స గరిగమపా - ధ ప స ని సగ రి- మగ
హృదయములో గతి - యనితలచి - నుతిసలిపితే - ముదముతో ఫలము - సగు
రి- నిస నిరిసా- నిదధపా- మగరీగామ } మరి॥
స-ధరలోన తా- వనకుతూ-హాలనీవేగ॥

ఆనందభైరవిరాగము-చాపుతాళము.

౪౩. హిమాచలతనయ బ్రోచుటకిది మంచిసమయము రావే-యంబ॥ ప॥
రాజజననీసమానమెవరిలను- మానవతి శ్రీబృహన్నాయకి॥ దేవి॥ అ॥ సరోజ
ముఖి రానినీవు- వరాలొసగుమనినువేడితి- పురారిహరిసురేంద్రనుతపురాణి-
ముఖమేలసేతల్లి॥ హి॥ ౧॥ ఉమాసంగమా- తామసమా- బ్రోవదికేవ
కరముగనుమా- కీర్తుడభిమానివి భరమా చలమా-వినుమాదయతోన॥ హి॥ ౨॥
గానతవరదాయకినిజదాసుడను- శ్యామకృష్ణసోదరిగదా- మురహరనదా- దురి
తహారిణి- శ్రీబృహన్నాయకి-దేవి॥ హిమా॥ ౩॥

శంకరాభరణరాగము- ఆదితాళము.

౪౪. సరోజదళనేత్రి హిమగిరిపుత్రి నీపదాంబుజములేసదానమ్మినాన
శుభమిమ్మా- శ్రీమీనాక్షమ్మ॥ ప॥ పరాకుసేయకవరదాయకి-నీవలెనే దై
వములోకములోగలదా- పురాణిశుకపాణిమధురవాణి- సదాశివునికిరాణి॥ అ॥
వచ్చినవారికెల్లను-కోర్కెలొసగేబిరుదుగదా- యతిభారమా నన్నుబ్రోవ
కృపాలవాల- నేతాళజాలనం॥ స॥ ౧॥ ఇందుముఖికరుణించుమని - నిన్నెం
తోకొంటిని- నామొరందుజాగేలనమ్మ- మరియాదగాదు-దయావనీవు॥ స॥

౨॥ శ్యామగానవినోదినీ-గుణధామ-శ్యామకృష్ణవినుతా- శుకశ్యామలాదేవి-స్వ గతిరతిశామ-కామ్యదకావవేనన్ను॥సరోజ॥౩॥

లలితరాగము-చాపుతాళము.

౪౫. నన్నుబ్రోవులలితా వేగమే - చాలనిన్ను నెరనమ్మియున్నవాడ గ భక్తకల్పకలతా॥ ప॥ నిన్నువినా యెవరున్నారు గన్జనని-యతివేగమేవచ్చి॥ ౧ పరాకుచేయక నెవచ్చి- కృపసలుపరాదా మొరవినదా- పరాశక్తిగీర్వాణవం తపాద- నీభక్తుడనమ్మసంతతమును॥నన్ను॥ ౧॥ సరోజభవకమలనాభ- శంక సురేంద్రసుతచరితా-పురాణివాణిఇంద్రాణివందిత- భోగిభూషణునికిరాణి॥న ౨॥ మదాంధులైయున్నదురాత్మ- జనములనుదాతలనిపొగడి- సదానేనిట్లామ్మ తిరిగితి-చంచలంబన్నియుదీర్చివరమొసగి॥ నన్ను॥ ౩॥ సుమేరుమధ్యనిలయ- శ్యా మకృష్ణునిసోదరికౌమారి- యుమానీనాతుమ్మశంకరి- యోమహారాజ్ఞిరక్షిం సమయమిది॥నన్ను॥ ౪॥ గామధనిసనిసగరిససనిధమగమగరిసమగమగదధమధ నిధనిసనిధనిదధమ॥నన్ను॥

మాంజిరాగము - చాపుతాళము.

౪౬. బ్రోవవమ్మతామసమేలే- దేవితాళలేనే- బిరాన॥ ప॥ నీవనా రణచేసితే - నిర్వహింపవశమా-కామాక్షి॥ అ॥ దీనరక్షకినీ వేయని- దివ్యమై నామమే - ధ్యానమువేరేమంత్రజపము లెరుగనేబిరాన॥ బ్రో॥ ౧॥ బాలమే నోదమా- శివశంకరి నీసమానమా- శూలినివేరేభక్తపరిపాలినిగాదా- బిర న॥ బ్రో॥ ౨॥ శ్యామకృష్ణసోదరి। శుకశ్యామలాత్రిపురసుందరీ- యీమహీ నీసమానదైవ- మెందుగాననేకామాక్షి॥బ్రోవవమ్మ॥ ౩॥

మధ్యమావతిరాగము- ఆదితాళము.

౪౭॥ పాలించుకామాక్షిపావనీ- పాపశమనీ॥ ప ॥ చాలాబహుకా ముగానిను- సదావేడుకొనెడి- నాయందేల యీలాగుజేసేవు- వెతహరింప వేవేగమెనన్ను ॥ అ ॥ స్వాంతంబులోననిన్నే - దలచేసుజనుల కెల్లనేవేళ సంతోషములొసగేవనినీవు - మనోరథఫలదాయిని - కాంతమగు పేరుపొ దితివి - కారుణ్యమూర్తిగా వైజగము కాపాడినతల్లిగదా- నేనునీదుబిడ్డను లించి॥ పా॥ ౧॥ ఈమూర్తియంత తేజోమయమైయుటువలెకీర్తి విస్ఫూర్తి

యిట్లానయెగుణమూర్తి । త్రిలోకములో జూచిన దైనగలదా - యేమితొలి నోమునోచితినో - నీపాదపద్మదర్శనముకేమారు లభించి। కృతార్థఁడనైతి। నామనవియాలించి॥ పా, ౨॥ రాజాధిరాజరాజన్మకటీ। తటవణిరాజభూజా లనిజసన్నధిదేవి- సమస్తజనులకెల్లవరదా। రాజముఖి। శ్యామకృష్ణనుతకాంచి పురీశ్వరీ- వికచరాజీవదళాక్షి। జగత్సాక్షి। ఘోరప్రసన్నపరాశక్తి॥పాలిం, ౩॥ నిసరి- పమరిస- నిసరిమరిస। నిసరిసా- రిసనిపా- పమపనిసరీ। పమప। సరీస, మపమ నిప।సనిరిస। మరీసనిప। రిసాని। పమారీస॥ పాలించు॥



# సుబ్బరాయశాస్త్రులవారి - కృతులు.



౪౮॥ శంకరినీవనినిను సంతతము కోరివచ్చితి॥ ప॥ సంకటముదీర్చిబ్రోచుట। కింకెవరున్నారిలలో॥ పంకజసంభవసన్నుత। పాలించుకామాక్షి॥శం॥ అ॥ కనకాద్రి సదనదీనజనరక్షకియనుచు । సనకాదిమునులు నిన్నుభజనచేయుచుండగను ॥ మునిమూకుని బ్రోచిన దెల్లను చాలావినివచ్చితి । వినుమా - ఘనమా। నినునమ్మినవాడ। డనురక్షింప॥ శం, ౧॥ బలవైరివినుతదేవతలకంటె సలయిన- ఖలదానవలబలఖండనముల జేసీసురలక॥ ఫలదాయకీనివలెనేగలదా యీయిలలోపల। కలుషానలహరిద శ్రీలలితంబికరక్షింప॥ శని, ౨॥ కరుణాబ్ధి తనికుమారుడు నిరతంబునుతించి। పరితాపములగదీర్చుట ధరలోననిన్నువినా పతిరెవ్వరులేరనియోవరదాయనిమొరపెట్టితె । కరుణించుటకీకరుదాసరదా పురక్షింప॥శంకరి, ౩॥

- సా- రినీ ధప- సని రిస- గా- మా- ధపమపగరీ స- సారినిధప। సని రిస కీ- కాం- చిసదన- సురదన- రా- కా- శశివదనరావె- కోకిలనిభ- మృదుగగ రి- గామపధప- స ని రి స- మగ రిసారినిధప- మాపగరిసా- రిని ధప - వ। కోరినవర- ములొసగి। ప్రుదుపరాకుసలుప। గాదుభరమా। పరమకృ।

గరిస॥ నిధివి ॥ } శంకరి॥౪॥

దర్బారురాగము - రూపకతాళము.

౪౯॥ మీననయననీవు నామీదకరుణజూడవమ్మ ॥ ప ॥ భానుకోటితేజనీ సమానదైవమునేగాన॥ అ ॥ మధురానగరినివాసిని మధుకైటభభంజని- విధు బింబ వదననీవాడను పరులనువేడను ॥ మీ ॥ ౧ ॥ త్రిపురాంతకునివిలాసిని త్రిపు రాంబసువాసిని - కృపజూడమంచిసమయముగాదానాతోనువాదా॥ మీ. ౨ ॥ శ్రుతిశాస్త్రవినుతవినుమాస్తుతి సేయనెపాత్రమా। గతినీవేయని కుమారుడు కోరినవాడమనీవాడను॥ మీన, ౩॥

తోడిరాగము - రూపకతాళము.

౫౦॥ శ్రీకమలాంబనా। చింతిదీర్చవే। అంబవేవేగమెరావే॥ప॥ పాకా రిముఖ సురనుతపాదానాతోవాదా॥ అ॥ కరుణాజలనిధిధరలో । నిన్నువినా - మరిమెవ్వరున్నారని - నీచరణము గొలిచితినిసదా - సదానీస్మరణముచేయు కుమారుని । కరుణించిబ్రోవసమయము - నిరతముగ శ్రీవెలయపురనివాసిని భవమోచనగ॥ శ్రీ॥

ధాపా- గామపా- ధపగా॥ మపమ॥ రిసని- నిసనిగా గ- మదధ నీస- నిగరి నీపా॥ దాజ్ఞమే- గతిలో॥ కులకు॥ కులకు - నిఖిలసాక్షి - సుతుని బ్రోవ- నినువి నిన- నిధపా। గామ॥ నిసనిగామ। గధనీనస। నిగరినీధ-నిధపాగామ॥
నామె।దరిలా।గోన॥నిజముగాబ।లికినా।ది।నిగమఆగ।మనుతారావె। } శ్రీ॥

ధన్యాసిరాగము - ఆదితాళము.

౫౧॥ దలచినవారుధన్యులయ్యేరు ॥ ప ॥ దలచివేడుకొని కొలచినవారి కి- ఫలములనోసగేలలితాంబనిను॥ అ॥ కోసరిసన్నిధిజేరినీపదయుగళము। మన సారగపూజించినసుకృతము - ద. ౧॥ కీశగమనునిమూలిదీర్చిపరి- పూర్తిగ లోసంగినమూర్తినిమదిలో॥ ద, ౨॥ మారరిపునుతకుమారజననికో- మారియ నిసదామరులుకొనుచునిను॥ దలచిన- ౩॥

ముఖారిరాగము - ఆదితాళము.

౫౨॥ ఏమనినే । నీమహిమదెలుపుదునమ్మ॥ ప॥ సామజగామిని। నీవే వేయలంబ । సారసలోచని ॥ అ ॥ హరిహయాసురముని వరులకునీదు। చరణ

కరుణాకరి శ్రీకరిని న్నెనెరనమ్మితిః వ, ౨॥ సదాదలచినదాసులకెల్లను దాసుడనౌ కరీ_ మదనారిసతికుమారుని॥ ముదసంపదకాస్పదమైనదిగానీపదపద్మము ॥వ, ౩

రీ- రి ప పమరి - రి గ రి రిసనిప- ని ని సా - ని స రి గ రిప - నిసరి సనిప
తా - మనమునకను- సలుపతగదువి - నుముకా - మితఫలములో । నగుటకనమ
ని స - రి రీ గరీస। రిమసని ప మ - ని నీ స- ని సగరి స స ని ప- నినిసా
యము- పురారిరిపు- ని కి వరములు - బిరాన - నొసగితివియనుచు - పినినే-

పాసనిపమ- రిగరిస॥ }
నీపదములు-గొలిచితి॥ } వనజాసన.

## కల్యాణిరాగము - ఆదితాళము.

౫౫. నినువినాగతిగానజగాన। వనరుహాక్షిధర్మ సంవర్ధనీకామనమ్మ ర్ధని॥ ప॥ వినుతపాలినివినీవనుచునే। వినిసదా నిన్నేశరణంటని । వనజనినివినుమ నినిను వేడుకొంటిని। వనరుహాభవదనుజరిపువినుతపద॥ అ॥ పదపంకజములెన మ్మితి । నాపవతెల్లనుచీర్తువని - నామదిలోనదలచినిన్నెకొలిచితి । మరాళగ మనిరావెపురారిసతిః ని, ౧॥ శరణాగత జనపోషణచణ । తరుణాంబుజనిభ భరణ। పరితాపములనుదీర్చిబ్రోవుము- పరాకుసలుపరాదుపురారిసతి,ని-౨॥ ఇలలోపలకరుణాంబుధి। నీవలే నేగలదా। వరదానతకలుషానల । జలధిసంతతవి నుత- కుమారునికభిమానినినీ వేగతిః,ని, ౩.

నిధమగరి। ధమ గరి। మగారి। సరిసా- నిధని స రి గ పధపా- మగరిసా-సరి
నిరతముగ- నినుమది- లో నేదలచికొ-రితినిటము గనువరదా - నిని రతా- దురు

గమపా।ధనిసరిసా। నిధపధపా-మగరిస॥ధానిసరి। }
సుగనా-దురితముదీ-ర్పుటకెదభా-రమవిన। తాళనిక॥ } నిను.

## యమునకల్యాణికాంభోజిరాగము- చాపుతాళము.

౫౬, నినుసేవించినజనులకు। నికయాజననబాధలుగలదే॥ ప॥ కనకాం గిశ్రీరుక్మిణీహృదయాబ్జవిభమణే। పార్థసారథిసామి॥ అ॥ భవసాగరతారకమై యున్నదిని॥ నవసారసయుగ్మము - భువిమానవలోకులకు భుక్తిముక్తిప్రదము నీపదము॥ భవసన్నుతనీమనామ। భజనిసదాచేయుచున్న- కవిజనావలలోలనీ సరి-గలద వేంకుమారఘాశ్రితపద॥నిను,

సారీ మపనిధా - సా॥ మగరిగ॥ నిధప- నిధప- మ గ రి-సారి సరి - మాప-
లారానినుసదా- కో॥ రితి విను॥ రితిని - మనవి- వినుము - సారసద-ళాక్ష-
మపధా-పధరిసా-మపధ పా-మగరి
శరణా- గతజనా-వనకృపా-నిధివి॥ } నిను.



# వీణ - కుప్పయ్యగారి కృతులు.



## ఆనందభైరవిరాగము-రూపకతాళము.

౫౭. కనికరములేకపోయెనా - నామీదనీకు॥ప॥ వనజాక్షునన్నిమ్మన
రాజనిసుంత్రైనగాని ॥ అ ॥ పనికిరానివానిచేతబాధపడుటదెలసి - నీవు - కను
సైగనుబిలిచినను- గాచేననిబలుకనీకు॥ క, ౧॥ సరివారునవ్వేరని-చాలనీతో మొర
పెట్టగ- వెరువకుమని వేవేగమె- నాకరముబట్టిదిటవుజెప్ప॥ క, ౨॥ నీపాదములేగ
తియనిమేప్రొద్దునుభజియించిన- గోపాలదాసునిమది- కొదువదీర్చిబ్రోవనీకు॥
నికరము, ౩.

## కమాసురాగము-ఆదితాళము.

౫౮, పాలించవేనన్నుఫణిపతిశాయి॥ ప॥ చాలించుకోపము-చాలనీకు
మొక్కేను ॥ అ ॥ చెంతకురమ్మనిచాలనేనువేడకోగ - వింతమాటలాడేది
దుకగాదుసుమ్మి॥ పా, ౧॥ కన్నతండ్రినాపైకరుణలేకయుందు- నన్నేలయిం
దినాయముగాదుసామి॥ పా, ౨॥ తాళజాలనురదయజూడవేళర- బాలగో
పాలదాసభక్తపోషణయిప్రుడు, పాలిం, ౩.

## ధన్యాసిరాగము-రూపకతాళము.

౫౯. నామొరాలకించినన్నుబ్రోవవమ్మా॥ప॥ భూమివెలయు శ్రీమధు
పురవాసి- త్రిపురసుందరి॥ అ॥ ననుకావగరాదా- నాపైదయలేదా-నినున
మ్మినవాడనుగాదా- నీమరినిదిదోచలేదా॥ నా, ౧॥ ఇటువంటివాడు- యీశ్వరి
రాదు-హాట్లముచేయవేళగాదు-అంభాగతివేరెలేదు॥ నా, ౨॥ హేమగిరిచా
పుయినాధతాళజాలా- భవసుతుడైనగోపాల- దాసునిపైకోపమేల॥నా, ౩॥

అఠాణకల్యాణిరాగము - రూపకతాళము.

౬౦. ననుబ్రోవరాదా- నామీదదయలేదా॥ ప॥ వనమాలియికనాతో వాదేలరముదంబలర॥ అ॥ సరసిజాక్షనిన్నుచాలసన్నుతించలేదా - సరగుననా మొరవినరాదా - జాగేలరపరాత్పరా॥ న, ౧॥ పలుమారునీనామభజనచేయలేదా - కలకలమనిరాతోపలుకరాదా - రాపుసేయకరా॥ న, ౨॥ కొలువుజేయు శ్రీవేణుగోపాలదాసునిమది - కలవరమునుదీర్చుము శ్రీకరా - పరాకుచేయకరా॥ ననుబ్రోవ, ౩.

బేగడరాగము - రూపకతాళము.

౬౧. సుందరిచన్నుందరిలోజూచిబ్రోవవమ్మా ॥ ప ॥ సందడియనీయింకుముఖిజాలమువద్దమ్మా॥ త్రిపుర॥ అ॥ పాలేసురపాలితజాలే - గమనజితమరాళే - స్వాకృతాఖిలలీలే - తిలకాంకితఫాలే-నీభక్తజనమేలే - నీదయరాదేలే॥ త్రిపుర॥ సుం, ౧॥ వాణీవినుతేశుకపాణీ - వరశేషవేణీలలితేకల్యాణీ - సాంబశివునిరాణీ-మాధుర్యవాణీ - నమ్మితిపూబోణితల్లి॥ త్రిపుర॥ సుం, ౨॥ వారిజాస్త్రశగాంభీరి- ఆదిపురవిహారి - దీనజనాధారి- నగరాజకుమారి - దుష్టమర్దనకారి- త్యాగరాజుకోరియున్నతల్లి॥ త్రిపుర॥ సుందరి, 3.

—•••(*)•••—

# కుప్పసామయ్యగారి - కృతులు.

ధన్యాసిరాగము - రూపకతాళము.

౬౨. అనుదినమునసీకధలను - వినవినవీనులకెంతో। ఆనందమాయెనయ్యా॥ ప॥ సనకసనందనాదివినుత- చతుర్ముఖవందిత- నిన్నెంతనికొనియాడుదు- శ్రీవరదవేంకటాచలరమణ॥ అ॥ సందేహములేక నిన్నెందెందువెతకిచూచినవందంబేగలడనుప్రహ్లాదునికొరకై। ముందుగమీరుకరస్తంభమునందువెడలి- కనకకశిపుమదాంధముతెగటార్చిన - నరహరిమురహరిశ్రీహరిహరి॥ అ, ౧॥ తనుమరచినకలుములచేతనుక్రొవ్విన। నలదుర్యోధనులమెల్లను - వేగహతముగాజేసి। కనికరముగనెమ్మదిగమదినినమ్మిన - నలపాండవులనుపాలించిన। సుజనానందముకుందగోవింద॥ అ, ౨॥ నమ్మినయల్లకుచేలుని- కొసగితివైశ్వర్యమ్ములు। నెన్నరిగానోసగినరుక్మిణీపతిగాదా- నిజమ్ముగనీపదపద్మములే। గతియని నమ్మితిముమ్మహి శ్రీవరదవేంకటేశ గీనసు... అను దిన. ౩.

గంభీరకల్యాణిరాగము - రూపకతాళము.

౬౩॥ రాదానామీదదయలేదా- మొరలిడగవిన॥ ప॥ వాదానీదాసుడ శ్రీవరదవేంకటేశ్వరవిన ॥ అ॥ పరమపురుషవినుముపతితపావనదీనజనావన । కరిమొరాలకించినశ్రీహరిహరియని మొరలిడివిన ♦ రా, ౧ ॥ సతతముచాలామదినినిజమ్ముగనమ్మినలయలద్రా - పదిమానసముగాచిన శ్రీపతిగతినీవగావిన♦ రా, ౨॥ తిరముగవరములొసంగే వరదుడనీవయనుచుశ్రీ। హరివరదవేంకటాద్రివిహారారారాయనవిన♦రాదా. ౩॥

కల్యాణిరాగము- రూపకతాళము.

౬౪॥ నీకేదయతోచికరుణించి - బ్రోతువనుచునిన్నెనెరనమ్మితి। మేననమ్మితిసామి॥ ప ॥ ఈకలియుగమునప్రత్యక్షదైవమునీవెగాకమరెవ్వరు । వరదవేంకటాచలరమణా॥ అ॥ మానముచేవిద్యలమంచిదెలిసిబ్రోచేటభి। మానినినే నెప్పటవున్నానివెదకిచూచిన । గానకఛీమనికోరగాని దురాశలవిడిదయా । ...గియనినినుకోనియా డెదపాడెదవేడెద♦ నీ, ౧ ॥ ఊరకనేభ్రమసియుంటికో ...దినములుసం- సారమునిజమనివేసారిసుఖముగానక♦ నారాయణశ్రీహరియ ...యనుదినముభజింపుచుకడ। తేరవలేనని తెలిసితి వినుమనుదినము ననిజము గ♦నీ, ౨॥ ఎంతని తెలుపుదుయింతంతగాదు - నావెసనంబంతయు నీకే తెలుసునయ్యాలు ...లుమిక- నీవింతలును శ్రీవరదవేంకటాచలరమణ- నేసంతతమ ననిన ప్రణుతించు ...నుతింతునుతింతు♦నీకేద, ౩॥

---

# వీరభద్రయ్యగారి-కృతులు.

ఆహిరిరాగము- ఆదితాళము.

౬౫॥ ఓమనసాయేమరకే శ్రీరామనామము॥ ప॥ సామరత్వముజెందక ...కటి - పట్టుగాబట్టియు ప్రతాప- రామాయనునామమే - నిరంతరముచలి ...ంపకదలచు♦ ఓ,అ॥ శారిజాసనప్రభృతి- దేవతవర్ణితమయంబగునామము, ...రదాదిమునిమానసానందకరంబగునామము । క్రూరసాపదావాగ్నికెన్న -

వారణాస్త్రము నామము - కోరినమ్మియున్న వారికెల్లను - కోర్కెలిచ్చుట
శుభనామము- ఓ, ౧ ॥ పుట్టనుబుట్టినమవ్వనికిజ్ఞానముపొడముజేసిననామము.
మట్టుమీరతలచిన ద్రౌపదిమానముగాచిననామము - పట్టుబడినగజపతియార్తిఁ
పోగొట్టినట్టిహరినామము - యెట్టివేళసద్ద్విజకోట్లుజపియించు - పావననా
మము, ఓ, ౨॥ రక్కసుడాఘంటాకర్ణునిసంరక్షించిననామము- నోర్కెడె
రెడక్షరములచే నొప్పుచుండెడు నామము - ఎక్కువన
ములమొరలిడుచు నుండెనామము - నిక్కముగ సకలజగంబెల్లను నలుపుచు
యుండెడునామము॥ ఓ, ౩॥ కలిలోనున్నభక్తిముక్తులకు కారణంబగునాఘనము
బలిచుట్టుకొని మెడితాపత్రయంబుల నెడబాపేనామము - తలచినంతనేక
కోట్లసుసద్గతు లొసగేనామము - లలిగతినిసంస్మరించు మిప్రతాపరామాయ
నెడునామము॥ ఓ, ౪॥ వినసహించని పతితులను పావలులజేసెడునామము.
తనువుమీర శివుడాద్యులకు నుపదేశము గావించేడు నామము - నినుజలింప
జేసేటియింద్రియములనణగగొట్టేడునామము- ఘనతరైశ్వర్యాదిశుభంబులుగ
లుగజేసెడునామము॥ ఓ మనసా, ౫॥

బిబాస్ రాగము- త్రిశ్రజాతి- రూపకతాళము.

౬౬॥ నీనామకీర్తనలేతారకమయ్యా॥ ప॥ మానితగుణాభిరామ- మా
ప్రతాపరామ॥ అ॥ సురనరవరకిన్నరాదిహరమునీంద్రులయినా-మిము దెలియగ
తరమా - పరమపావనమిమ్మురగనీ- స్మరణమహిమఅనగానేనెంతవాడను -
నరుడనుదుర్మదుడను - యిక నామీదకరుణజూడు॥ నీ, ౧ ॥ అనువుగమునుఆగ
జేంద్రుడాదిమూలమాయని పిలచిననంతనే - ఎంతోముదమున దయారస
ముజిల్క ముందుగానువచ్చి - వానిఘనతను పావనుని జేసి గాచినట్టిమహిమ
గల్గు॥ నీ, ౨॥ కూరిమిమీరగ రాజగోపాలదాసుడు గొలుచు-శుభావతారధీరా
సతతము సారెకు శీతుళజరాజాదీను - డతిభక్తిమీరగపూజించు లేర - సారా
ప్రతాపరామ॥ నీ నామ, ౩॥

## పరిమళరంగని - కీర్తనలు.



### పంతువరాళిరాగము - ఆదితాళము.

౬౭॥ నిన్నేచాలనమ్మినందుకు- నీనామములేనైభజనచేయగలిగేన॥ ప॥ ధన్యుడైనాను నేనిపుడు దయసేయవెపరిమళరంగనాయకి ॥ సగరిస నిధనిస రిరిసనిధప - ధనిసరిరిసనిస- రిగమగరిస - రిగమప- ధపమపధ●పమధప- రిరి గగరిని ధరిసనిధపమగరిస ॥ అ ॥ మున్నుచేసినపూజమహిమో - ముదమున కరుణించినావు - నన్నునీవాడనియెంచినమ్మికలిచ్చినావు - అన్నపానాదులకు నీవునపారముగనొసంగినావు- ఎన్నటికినినీప్రాపుఈవెకలుగజేసినావు॥ ని, ౧॥ ఎవరున్నారునీకుసాటి - యీరేడుజగములో - వివరస్తులైనవారిని వేరెగాన నమ్మ - భవసాగరమునదాటించేనన్నుపాలించికాపాడితివి - కవనధారలుగలుగ నాకు - గమనమునీయందుండజేసితివి ॥ ని, ౨॥ పన్నగశయనుడైనపరిమళరం గనికొమ్మ - ఎన్నతరమనీమహిమలు ఎవరును తెలియలేరు - నన్నునీభక్తుడని యిపుడు - నమ్మికలొసంగియాదరించితివి - కన్నతల్లినీవేయనుచుకలలో మొదలు మరువకనేను-నిన్నే, ౩॥

### కల్యాణిరాగము - రూపకచాపుతాళము.

౬౮॥ రంగనాయకియమ్మ - ననురక్షింపవమ్మ॥ ప॥ అంగజునిగన్నమ్మ- యాదరింపవే శ్రీరంగనికొమ్మ ॥ గరిసనిధానీసన్నిసరీసన్ని సరిగసరిగరిగమ గరిగ- మపధపధనిసరిసస- ధపమాగరిససిస॥ అ॥ నీవెదిక్కనుచు నేచాలనమ్మి-ని రతముభజియింతునమ్మ- వారధిబాలయే వేళలనీనామమే - హితవని నేనుతిజేయ గ- కావతడవుచేయకను - కరుణింపుమునేనీతనయుడ॥ రం, ౧॥ మనవియొసం గవేమిపుడు - యిమ్మహిలోకలిమియొసంగవెలసీయున్నావు - కనకాంగిగోమ మ్మకపటమేనీవుచేసేవు - మనసుననినుమరువక ముమ్మాటికినేతప్పకమ్రొక్కితి॥ రం, ౨॥ పరిమళశ్రీరంగనాయకినన్ను - పాలింపవెయిపుడు సకలశుభదాయ కి- మరివేరెదైవములనూటిమాటికివేడను - సగణిజనదనీ చరణములెనమ్మినవా డను॥ రంగనాయకి॥ ౩॥

కల్యాణిరాగము - ఝంపెతాళము.

౬౯॥ రంగనాయకియమ్మరక్షింపవమ్మా॥ ప॥ అంగజునిమించినయందమైనరంగనికొమ్మా॥ గమపమపదధపమపధప- ధసినిధ-నిససనిసరిరిసస సధనిపధపవ గమపధపమపగరిగగరిసరి॥ అ॥ నీవేదిక్కని నేనునెరనమ్మియున్నాను- ధావంత్రములచేత తల్లడింపలేను - కావవేయిపుడునన్ను కంజదళాక్షి దయతోను నీవాడనికరుణారసము నించుముదముతోను॥ రం, ౧॥ నమ్మినవారినికాపాడినబంగరుబొమ్మా - యిమ్మహిలోనేవేరెయితరులనమ్మ- యిమ్మనీనవరమెల్ల నిపుడేసివియవమ్మ - కమ్మవిల్తునికన్న ఘనుడుమెచ్చినయమ్మ॥ రం, ౨॥ పరిమళశ్రీరంగనాయకిపాలించుదయతోను- మరివేరెదిక్కులేనేగాన- మహితలములోను కరిరాజగమననీవె - కటాక్షింతువనినేను - దుదితపములుదీరునని తోచునేనున్నాను॥ రంగనాయకి, ౩॥

కన్నడరాగము - ఝంపెతాళము.

౭౦॥ కన్నడసేయక వే-కరుణింపవమ్మా॥ప॥ పన్నగశయనుడైనపరిమళశ్రీరంగనికొమ్మా॥ నిసధామదథాసిసధనిసాససరిరిస- నిసగామప- మదధనిధనిససిసరిరిసని- సధనిపధమప- ధససరిగమరి ససిసధనిస॥ ధపమధపపమపగరిససిస॥ అ॥ నవనిధికికర్తనైన। నళినసేత్రినేను - భవవిచారమునతగిలి। బాధజెందలేను। వివరముపలుకవమ్మ। వేరుచేయకనన్ను- కవనమునీప్రేరచించ। గరుణించువిపుడు॥ క, ౧॥ పంకజాసనుడుమొదలైన। పరమభాగవతులుమిగుల। పొంకముననుతిజేసిన। పూబోణనన్ను - సంకటముపరచతగదు। సరగునకలిమియొసంగియికనీదునీవాడ। నీవెపోషింపవమ్మా॥ క, ౨॥ పరిమళశ్రీరంగనాయకి। పదములెనమ్మినాను - సరివారిముందరనన్ను - చౌకసేయకవమ్మ। మరియాడదెలిసియుండే-మహావత్తులెవ్వరులేరు-సరసిజవరనిన్నే-చాలనే కోరినాను-కన్నడ, ౩॥

బృందావనసారంగరాగము- ఆదితాళము.

౭౧॥ పక్షపాతమునీయందున్నదిపంకజదళనేత్రీ॥ ప ॥ కుక్షిలోసకలజగములనుచుకొన్నను - గణపరిమళశ్రీరంగనిరాణి ॥ రిమపమనిపససిరిసస పనిమప - నిసరిసరిసని పసిమప మరిరిప మరిస॥ అ॥ నవరత్నములకొందు

గొసంగేవు-నల్లపూసలుకొందరికొసంగేవు- భవమోచనియీవంచన జేసే ప్రభావమేమమ్మ- ఆసలొగలిగిననరులకెల్లనీ-వాధారమైనలోకజనని- వివరము దెలుపకయూరకయున్నావు- వింత జేసితివిబాగాయనమ్మ॥ ప, ౨॥ బంగారుసొమ్ములు గొందరికొసంగేవు-బాగైనగిత్తెకొందరికొసంగేవు- శృంగారమగుసారంగ గమనసీచిత్తమదేమమ్మ-భంగపరిచేవుకొందరినినీవు- పాలించేవుకొందరినినీవు-మంగళకరమైనమూర్తివినీవు- మనుజులపట్లవేడుకలు జేసేవు॥ ప, ౩॥ అందలములు గొందరికొసంగేవు - అతిదారిద్ర్యముకొందరికొసంగేవు- మందరగిరిధరుడైన మాపరిమళశ్రీరంగనికొమ్మ-యెందుకనీకీగుణమమ్మ- యీభూమిజనులందరునీకు పుత్రులు- కందర్పునిగన్నచక్కనిబొమ్మ। కడకంటజూచేవ శ్రీరంగనాయకి॥ పల్లవి, ౩.

కేదారగౌళరాగము - ఆదితాళము.

౭౨. రంగనాయకి నేనునీపదరాజీవమేనమ్మితి॥ ప॥ అంగజునిగన్నరంగని రాణి-యాదరింపవే మోదముతోను॥ససిధపమగరిమగస-సరిమగరిమపసిదధపమ। ధమపమగరిమప॥ అ॥ నరులనుకొలిచి నే వేడజాల।నటించివడచి వేసారితిచాల।నిరత మునినుతమ్మితిగుణశీల।నీవేరక్షింపవలెనమ్మయీ వేళ॥ రంగనా, ౧॥ అన్యదైవములకొలువగలేను-అంబుజపాణినిన్నేకోరియున్నాను- ననుకావవేనీకృపతోను-నానాటికినధికభక్తితోను॥రం, ౨॥ పరిమళశ్రీరంగనాయకనీవు-భక్తులపాలింప వెలసియున్నావు - దురితముదీర్పకజాగుచేసేవనీ। ధరజనులకాధారమైనావు॥ రంగనాయకి, ౩.

తోడిరాగము- ఆదితాళము,

౭౩. రంగనాయకి నీపదాంబుజముల శరణంగనుటేమేము॥ప॥ మంగళకరమైనమూర్తివైవెలసినమాపరిమళశ్రీరంగనికొమ్మ॥ గరిసనిధ పధనిసరిని స - రిసనిస- రిగమగగరిరిస - రిగమపధపమప - ధపధనిధ పధనిధసనిరిసనిధ నిసరిగమగగరినిధనిధనిధపమగరిరిస ॥ అ ॥ నీనామమహిమలు తెలియగలేము- నీవెరక్షింతువనికోరియున్నాము - నానాదైవములనుభక్తిచేయబోము - నమ్మియున్నాము నిన్నునిత్యముగాము॥ రం, ౧॥ నరులనుక్షేమముసడ్డజేసేదిలేదు॥ నీ॥

